# పార్టీ ఆంతరంగిక పోరాటం



రచన:

లీ-షావ్-చీ

అనువాదం:

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)





విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# తొలిపలుకు

కామ్రేడ్స్,

పార్టీ సభ్యుల చైతన్యాన్ని గట్టిపరచే సమస్యను ఈమధ్య మనపార్టీ తీసుకుంది. ఈ విషయమై కేంద్రకమిటీ ఒక నిర్ణయం కూడా చేసిందని విన్నాను. అది మనకు త్వరలోనే అందుతుంది. మన సభ్యుల పార్టీచైతన్యాన్ని గట్టిపరచే పనిని పెంపొందించడానికి, అందుకు విరుద్ధమైన అవాంఛనీయ లక్షణాలకు వ్యతిరేకంగా ఒక నిర్దిష్టమైన సిద్ధాంత పోరాటం ప్రారంభించబోతున్నాం. అయితే, యీ సిద్ధాంత పోరాటాన్ని సవ్యంగా నడపవలసిన పద్ధతి ఏది? అపసవ్య పద్ధతి ఎలా ఉంటుంది? ఈ సమస్యను గురించే నేనిప్పుడు చర్చించదలచుకున్నాను.

మనది శ్రామికవర్గ పార్టీ అనీ, అది ప్రజాసామాన్యం యొక్క పోరాటాలను నడుపుతుందనీ అందరికీ తెలుసు. పార్టీ తన చారిత్రక కర్తవ్యాలను నెరవేర్చాలంటే, వివిధ దశల్లో విప్లవ ప్రతీఘాతకశక్తుల్ని అది ప్రతిఘటించవలసి యుంటుంది; అనేక విప్లవ వర్గాలతోను, విప్లవశక్తులతోను చేతులు కలపవలసియుంటుంది.

మనపార్టీ పుట్టినప్పటినుంచీ తీవ్రమైన పోరాటాల వాతావరణంలోతప్ప అది జీవించలేదు. శ్రామికవర్గము, మన పార్టీ ఎడతెగకుండా అనేక శ్రామికేతర పార్టీల–పెద్ద పెట్టుబడిదారులు, మధ్యతరగతి ప్రజలు, రైతులు, భూస్వామ్యశక్తుల అవశేషాలు – వలయంలో జీవించవలసి వచ్చింది. వీరు శ్రామికవర్గానికి వ్యతిరేకంగా పోరాడుతూన్నప్పుడు లేదా ఆ వర్గంతో సహకరించేటప్పుడు పార్టీలోని, శ్రామికవర్గంలోని అస్థిరమైన

వారిని ఉపయోగించుకొని పార్టీయొక్క, శ్రామికవర్గంయొక్క హృదయకుహరాల్లోకి ప్రవేశించడానికి ప్రయత్నిస్తూవచ్చారు. సిద్ధాంతం, ఆచరణ, జీవితపు అలవాట్లలో తమ ప్రభావాన్ని కలుగజేయడానికి ఎంతో కృషిచేస్తూ వచ్చారు. పార్టీలో రకరకాలైన తప్పుడు ధోరణులు, అవాంఛనీయ లక్షణాలు ప్రవేశించడానికి మూలం యిదే. పార్టీలో వివిధ రకాలైన అవకాశవాదానికి ప్రాతిపదిక యిదే. పార్టీలో ఆంతరంగిక పోరాటాలకు కూడా మూలం యిదే.

పార్టీలో ఆంతరంగిక పోరాటాలు పార్టీబయట జరిగే వర్గపోరాటాల ప్రతిబింబమే.

మన పార్టీ పుట్టినప్పట్నుంచీపార్టీ బయటనున్న శత్రువులతోనేగాక, పార్టీలోని శత్రువర్గ పోకడలకూ, శ్రామికేతరధోరణులకూ కూడ వ్యతిరేకంగా పోరాడుతూ వచ్చింది. ఈరెండూ వేర్వేరు పోరాటాలేగాని, అవి చాల అవసరమనీ, రెండిటివర్గస్వభావమూ ఒకటేనని మనంమరచిపోకూడదు. మనపార్టీ ఈరెండవ విధమైనపోరాటంకూడ సాగించకపోతే, పార్టీలోని అవాంఛనీయ ధోరణులన్నిటికీ వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం జరపకపోతే, శ్రామికేతర సిద్ధాంతాలను పార్టీనుంచి ఎప్పటికప్పుడు నిర్మూలించకపోతే, అతివాద మితవాద అవకాశవాదాన్ని లేకుండా చేయడానికి పాటుబడకపోతే, అట్టి శ్రామికేతర సిద్ధాంతాలప్రభావం, అతివాద మితవాద అవకాశవాదం మనపార్టీలో ప్రవేశించవచ్చు; ఆసిద్ధాంతాలే పార్టీమీద అధికారంకూడా చెలాయించవచ్చు. ఇలా జరిగిననాడు, పార్టీ తన్నుతాను సంఘటితపరచుకోవడంగాని, అభివృద్ధి చెందడంగాని, తన

స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవడంగాని సాధ్యపడదు. పార్టీ ప్రమాదంలోపడి, శిథిలమవడానికి దారితీస్తుంది. అలాంటి శ్రామికేతర సిద్ధాంతాలు, అతివాద - మితవాద అవకాశ వాదం పార్టీని, లేదా పార్టీలోని కొందరిని కలుషిత మొనర్చ వచ్చు. పార్టీయొక్క, లేదా పార్టీలోని కొందరియొక్క స్వభావాన్నే మార్చివేసి పార్టీని శ్రామికేతర సంస్థగా తయారు చేయవచ్చు. ఉదాహరణకు యూరపులోని సోషల్ డెమాక్రటిక్ పార్టీలు ఈ విధంగానే బూర్జువా (పెట్టుబడిదారీ) సిద్ధాంతాలవల్ల కలుషితమై, బూర్జువా వర్గపు రాజకీయ పార్టీల మాదిరిగా తయారయాయి. ఆ విధంగా బూర్జువా వర్గపు సామాజిక పునాదులుగా అవి మారిపోయాయి.

అందుచేత పార్టీలో ఆంతరంగిక పోరాటం చాల అవసరం. అట్టిపోరాటంనుంచి ఎవ్వరం తప్పించుకోజాలం. పార్టీ ఆంతరంగిక పోరాటంనుంచి తప్పించుకోవాలను కోవడంగాని, యితరులు తమతప్పులను ఎత్తిచూపుతారనే భయంతో వారి తప్పులను విమర్శించకుండా ఊరుకోవడంగాని చాల పొరబాటు.

పార్టీ ఆంతరంగిక పోరాటాలు ప్రధానంగా సిద్ధాంత పోరాటాలు. సిద్ధాంతం, మూలసూత్రాల విషయంలో ఉత్పన్నమయే విభేదాలన్ను, నైరుధ్యాలను అవి ద్యోతకం చేస్తాయి. మన కామ్రేడ్స్‌లో సిద్ధాంతం, మూలసూత్రాల విషయంలో వచ్చే విభేదాలూ నైరుధ్యాలూ పార్టీలో రాజకీయ చీలికలకుకూడా దారితీయవచ్చు. కొన్ని సందర్భాలలో నిర్మాణ సంబంధమైన చీలికలకు సహితం దారితీయవచ్చు. అయితే వాటి స్వభావానికి, విషయానికి సంబంధించినంతవరకు

అట్టి విభేదాలు, వైరుధ్యాలు ప్రధానంగా సిద్ధాంత పోరాటాలే. అందుచేత సిద్ధాంతం, మూలసూత్రాలకు సంబంధించని పోరాటాలు సిద్ధాంత వ్యతిరేక పోరాటా లవుతాయి. పార్టీలో ఈ విధమైన పోరాటాలు అనవసరమేగాక, పార్టీకి ఎంతో నష్టం కలిగిస్తాయి. ప్రతి పార్టీ సభ్యుడు అట్టి పోరాటాలకు దూరంగా వుండాలి.

పార్టీయొక్క నైర్మల్యాన్ని, స్వాతంత్ర్యాన్ని కాపాడా లంటే, పార్టీ కార్యకలాపాలన్నీ శ్రామికవర్గంయొక్క అత్యున్నత ప్రయోజనాలను రక్షించేవిధంగా ఉండాలంటే, పార్టీయొక్క శ్రామికవర్గ స్వభావాన్ని కాపాడాలంటే, పార్టీలో ఆంతరంగిక పోరాటం తప్పనిసరిగా అవసరం. ఇందుకు మనం రెండువైపులనుంచి, రెండు రంగాలమీద ఆంతరంగిక పోరాటాన్ని సాగించాలి. శత్రుసిద్ధాంతాలు రెండువైపులనుంచి పార్టీమీద తమ ప్రభావాన్ని కలుగజేయడమే యిందుకు కారణం; "అతివాద", "మితవాద" దృక్పథాలనుంచి పార్టీవిధానాన్ని వ్యతిరేకించడమే శత్రుసిద్ధాంతాల లక్ష్యం. ఇది పార్టీలో బయల్దేరే "అతివాద"అవకాశవాదంలోను, మితవాద అవకాశవాదంలోను ద్యోతకమవుతూ వుంటుంది.

అందుచేత, మన ఆంతరంగిక పోరాటం ఏకకాలంలో "అతివాద", "మితవాద" ధోరణులపై సాగవలసియుంది. అలా జరిగినప్పుడే, పార్టీ తన ఖచ్చితమైన శ్రామికవర్గ స్వభావాన్ని కాపాడుకోగల్గుతుంది. అలాగాక ఒకే పెడమార్గంమీదపోరాటం సాగించినా, లేక రెండిటిలో ఒక పెడమార్గంమీద మన అప్రమత్తతను, పోరాటాన్ని బలహీనమొనర్చినా శత్రువు మన

(కృష్ణా జిల్లా)

పార్టీని ఆవైపునుంచే దెబ్బగొట్టగల్గుతాడు; దెబ్బగొట్టితీరుతాడు కూడా. అప్పుడు పార్టీయొక్క నైర్మల్యాన్ని, స్వాతంత్ర్యాన్ని రక్షించడం అసాధ్యమవుతుంది; పార్టీని సంఘటితపరచడం దుర్లభమవుతుంది. కాబట్టి, రెండు రంగాలమీదా ఎడతెగకుండా ఆంతరంగిక పోరాటం జరపడం ద్వారానే మన పార్టీ సంఘటితపడుతూ అభివృద్ధి చెందుతుంది.

కామ్రేడ్ స్టాలిన్ యీ విధంగా చెప్పాడు:

"ఇక్కడ మన ముందున్న సమస్య ఏమంటే, ఏదో ఒక సిద్ధాంతం కొరకు, ఏదో ఒక పోరాటంయొక్క లక్ష్యాన్ని నిర్వచించడానికి, ఆలక్ష్యాన్ని చేరుకోనేందుకు ఏదో ఒకపోరాటపద్ధతిని ఎంచుకోడానికి పోరాడ్డం ద్వారానే వైరుధ్యాలను అధిగమించగలం. ప్రస్తుత (పార్టీ) విధానానికి సంబంధించిన సమస్యలపై, పూర్తిగా ఆచరణకు సంబంధించిన సమస్యలపై మనతో భేదించే పార్టీ సభ్యులతో ఒప్పందానికి రాగలం, రావాలి. అయితే యీ విభేదాలు సిద్ధాంతానికి సంబంధించినవై ఉంటే మాత్రం ఒప్పందాలు, "మధ్యేమార్గాలు" సమస్యను పరిష్కరింపజాలవు. సిద్ధాంత సమస్యలపై "మధ్యేమార్గం" ఉండదు, ఉండజాలదు. పార్టీ కార్యకలాపాలు కొన్ని సిద్ధాంతాలమీద ఆధారపడి ఉండాలి. సిద్ధాంత సమస్యలపై "మధ్యేమార్గం" మన బుర్రలను పాడుచేస్తుంది; విభేదాలను మరుగుపరుస్తుంది; సిద్ధాంతరీత్యా పార్టీని కలుషితమొనర్చుతుంది; సిద్ధాంతరీత్యా పార్టీని నాశనం చేస్తుంది. అలాంటి "మధ్యేమార్గం" అవలంబించడం మన పంథా కాదు. రోజురోజుకూ పతనమయే పార్టీ మాత్రమే అట్టి పంథా అవలంబిస్తుంది. అట్టి పంథావల్ల పార్టీ ఒక నిరంకుశ సంస్థగా, కష్టజీవులకు దూరంగా ఉండే సంస్థగా, ఏపనీ చేయలేని కీలుబొమ్మగా మారిపోతుంది. మనం అలాంటి పంథా అవలంబించకూడదు."

ఇంకా యిలా అన్నాడు:

"పార్టీలో ఉత్పన్నమయే వైరుధ్యాలను అధిగమించడం ద్వారానే మన పార్టీ బలపడింది."

పార్టీ ఆంతరంగిక పోరాటంయొక్క మూలస్వభావాన్ని పై వాక్యాలు వివరిస్తున్నాయి.

పార్టీ ఆంతరంగిక పోరాటంయొక్క మూలస్వభావ మెట్టిదో, పార్టీలో ఉదారవాదం రాజీ ధోరణి ఎందువల్ల ఉండరాదో లెనిన్, స్టాలిన్‌లు యిదివరకే తమ రచనల్లో చాలవరకు స్పష్టంచేశారు. ఆ రచనలను మీరంతా చదవ వచ్చు. ప్రస్తుతం నే నీవిషయంపై యింతకన్న ఎక్కువ చెప్పను.

ఇప్పుడు నేను పార్టీలో ఆంతరంగిక పోరాట మెలా సాగించాలి - అనే సమస్యపై మాట్లాడుతాను. మనకిది యిప్పటికీ కొత్త సమస్యే. ప్రతివారూ యీ సమస్యను గురించి సాకల్యంగా తెలుసుకోవడం అవసరం. చైనా కమ్యూనిస్టుపార్టీ గడించిన చారిత్రక అనుభవాన్ని గురించి నేను చేసిన పరిశీల నల నాధారంగా చేసుకొని నా అభిప్రాయాలను మీ యెదుట పెడతాను. అవి సరియైనవో కావో కామ్రేడ్స్ అంతా చర్చించవలసిందని కోరుతున్నాను.

—లీ - షావ్ - చీ

# 1

# చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడిననాటి ప్రత్యేక పరిస్థితులు; పార్టీ ఆంతరంగిక పోరాటంలో ఉత్పన్నమైన పెడవార్గాలు.

కామ్రేడ్స్!

మార్క్స్, ఎంగెల్స్ ప్రపంచ శ్రామికవర్గానికి చేసిన సహాయ మెట్టిది?

వారు ప్రపంచ శ్రామికులకు సమగ్రమైన, సంపూర్ణమైన సిద్ధాంతపరిజ్ఞానాన్ని ప్రసాదించారు. అంతేగాక, శ్రామికవర్గాని కొకస్వతంత్ర సంస్థను స్థాపించి, ఎన్నో శ్రామిక పోరాటాలను నడిపారు, మొదటి అంతర్జాతీయ కార్మిక సమాఖ్యను, ఆ తర్వాత రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యను నెలకొల్పారు. అనేక యూరపియన్ దేశాల్లో సోషల్ డెమాక్రటిక్ పార్టీలను, ట్రేడ్‌యూనియన్లను నిర్మించారు. కార్మికు లెలా సంఘటితమవాలో, పోరాటా లెలా నడపాలో చూపి వారిని తరిఫీదు చేశారు.

రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్య కాలంలో (అంటే మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం) వివిధదేశాల్లోని సోషల్‌డెమాక్రటిక్ పార్టీలు కార్మికులలో విస్తృతమైన నిర్మాణ కృషి చాలా చేశాయి. కార్మికవర్గాన్ని సంఘటితపరచే కార్యక్రమాన్ని, ఉద్యమాన్ని ఎంతో విస్తృతపరచాయి. నిర్మాణం విషయంలో అద్భుతమైన విజయాలు సాధించాయి. పెట్టుబడి

దారీ విధానం "శాంతియుతంగా" అభివృద్ధిచెందే దశ అది. అట్టి దశలో కార్మిక సంస్థలు నిర్మింపబడ్డంవల్ల పార్టీకీ, ట్రేడ్ యూనియన్లకూ వ్యత్యాసం అంతగా కనబడేదికాదు.

ముఖ్యంగా మార్క్సు, ఎంగెల్సు చనిపోయిన తర్వాత కాట్‌స్కీ—ముఠా నాయకత్వంక్రింద రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్య పార్టీలో నిషేధింపబడవలసిన అవకాశవాదంయెడల రాజీధోరణి నవలంబించింది. అందుచేత రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన పార్టీలను అవకాశవాదం కలుషిత మొనరించింది. సామ్రాజ్యవాదదశ, అంటే శ్రామిక విప్లవాల దశ, ప్రారంభమయేసరికి ఈ పార్టీలు, ట్రేడ్‌యూనియన్లు నూతన దశలో కార్మికవర్గం నిర్వహించవలసిన విప్లవ కర్తవ్యాలను నిర్వహించలేకపోయాయి. తత్ఫలితంగా అవి మొదటి ప్రపంచ యుద్ధపురోజుల్లో శిథిలమై పతనం చెందాయి.

మార్క్సు, ఎంగెల్సుల దశకూ, లెనిన్‌దశకూ తేడాఉంది. లెనిన్‌దశ సామ్రాజ్యవాదదశ; పెట్టుబడిదారీ విధానం శిథిలమయేదశ; శ్రామిక విప్లవం విజృంభించేదశ. ఈ దశలో శ్రామికవర్గం బలీయమైన ఒక మిలిటెంటు పార్టీని నిర్మించుకో వలసిన అవసరమేర్పడింది. సిద్ధాంతంలోను, రాజకీయంగాను, నిర్మాణాత్మకంగాను, ఆచరణలోను సంపూర్ణమైన ఐక్యతను సాధించి, శ్రామిక జనసామాన్యంతో సన్నిహిత సంబంధాలుండే పార్టీ ఆనాడు అవసరమైంది. అలాంటి పార్టీమీద ఆధారపడ్డం ద్వారానే, అత్యంత క్లిష్టమైన విప్లవపోరాటాలను విజయవంతంగా నడపడం సాధ్యం. అందుచేతనే లెనిన్ మార్క్సు, ఎంగెల్సుల సిద్ధాంతాలను అన్నివిధాలా పునరుద్ధరించి అభివృద్ధి

చేయడంతోబాటు, శ్రామికవర్గపు విప్లవపార్టీలను నిర్మించడ మెలాగో తెలియజేసే ఒక సమగ్ర సిద్ధాంతాన్నికూడా సృష్టించాడు. మనపార్టీ నిర్మాణానికి సంబంధించిన మూలసూత్రాల ప్రణాళికను ప్రధానంగా లెనినే సృష్టించాడు. పార్టీనిర్మాణానికి సంబంధించిన యీ సిద్ధాంతాన్ని మనం శ్రామికుల విప్లవ పోరాటాన్ని నడిపేటప్పు డవలంబించవలసిన వ్యూహం, ఎత్తుగడలనుంచి వేరుచేసి చూడకూడదు.

లెనిన్ శ్రామికవర్గపు విప్లవ పార్టీని స్థాపించిన నాటి పరిస్థితు లెట్టివి?

ఒకవైపు సామ్రాజ్యవాదయుద్ధం దగ్గరకొస్తూంది; శ్రామికవర్గం పెట్టుబడిదారీ వర్గాన్ని కూలద్రోసి, రాజ్యాంగాధికారాన్ని స్వాధీనంచేసుకొని, శ్రామికనియంతృత్వాన్ని స్థాపించవలసివ తక్షణకర్తవ్యాన్ని నెరవేర్చవలసిన సమయం అది. మరోవైపు రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన సోషల్ డెమాక్రటిక్ పార్టీలు అతి విస్తృతంగా వ్యాపించియున్నప్పటికీ, పెట్టుబడిదారీ వర్గాన్ని కూలద్రోసి శ్రామిక నియంతృత్వాన్ని స్థాపించవలసిన అవసరాన్నింకా అవి గుర్తించలేదు. శ్రామికవర్గం విప్లవయుతమైన ఎదురుదాడి చేయడం వాటికిష్టమూ లేదు, అందుకు సన్నాహాలు చేయగల ధైర్యమూ లేదు. అందుచేత రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన పార్టీలన్నీ కట్టుదిట్టమైన నిర్మాణం లేకుండా ముఠాలుగా చీలిపోయి, తీవ్ర పోరాటాన్ని నడపలేని స్థితిలో పడ్డాయి. తత్ఫలితంగా శ్రామికవర్గపు విప్లవ ప్రయోజనాలను రక్షించడంలో అవి పూర్తిగా విఫలమయ్యాయి.

ఆనాడు వివిధ దేశాల్లో ఉన్న సోషల్ డెమాక్రటిక్ పార్టీలు సిద్ధాంతరీత్యాను, రాజకీయంగాను మితవాద అవకాశ వాదపు ఊబిలో దిగబడ్డమే కాకుండా (ఉదాహరణకు పెట్టుబడిదారీ వర్గానికీ శ్రామికవర్గానికి మధ్య సామరస్యం తీసుకు రావచ్చుననీ, పెట్టుబడిదారీ విధానం శాంతియుతంగా సోషలిజంలోకి మారుతుందనీ, శ్రామికవర్గం విప్లవపోరాటాల అవసరం లేకుండా పార్లమెంటరీ పద్ధతులద్వారానే అధికారంలోకి రావచ్చుననీ, అందుచేత శ్రామిక విప్లవాని కవసరమైన వ్యూహంగాని, ఎత్తుగడలు గాని తయారుచేయ నక్కరలేదనీ ఆ పార్టీలు సిద్ధాంతీకరించాయి) పార్టీనిర్మాణం విషయంలో కూడా పూర్తిగా మితవాద అవకాశవాదంలో పడ్డాయి. రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన పార్టీలు, రష్యాలోని మెన్షివిక్కులు పార్టీనిర్మాణంలో ఉదారవాద మార్గమవలంబించారు. శ్రామికవర్గ పార్టీని ఒక సామాన్య కార్మికసంస్థగా తయారుచేసే మార్గమవలంబించారు. పార్టీలో గట్టినిర్మాణం గాని, క్రమశిక్షణగాని అవసరంలేదని వారు భావించేవారు. పార్టీలోపల నియమరహితమైన సామరస్యం ఉండాలని వారు వాదించేవారు. పార్టీలో సిద్ధాంతానికి, నిర్మాణానికి సంబంధించిన విభిన్న ముఠాలను వారు సహించేవారు. రెండవ అంతర్జాతీయ కార్మికసమాఖ్యకు చెందిన పార్టీల దృష్టిలో ఐక్యతగాని, క్రమశిక్షణగాని, ఆత్మవిమర్శనగాని, ఆంతరంగిక పోరాటంగాని అవసరంలేదు. ఇవి వారికి ఊహాతీతమైన విషయాలు.

నిర్మాణానికి సంబంధించినంతవరకు రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన పార్టీలలో మితవాద అవకాశవాదం ప్రైవిధంగా ఉండేది.

ఆ రోజుల్లో రష్యాలో ఆర్థికవాదులు, యూరపులో (ఫ్రాన్స్ మొదలైన దేశాలు) సిండికలిస్టులు కూడ ఉండేవారు. వారు కార్మికవర్గానికి పార్టీయే అవసరంలేదని వాదించేవారు. కార్మికవర్గ పార్టీలను నిర్మించడానికి నిరాకరించేవారు; లేదా కార్మికవర్గ పార్టీలను ట్రేడ్ యూనియన్‌లకు అధీనసంస్థలుగా చేసేవారు. "ట్రేడ్ యూనియన్‌లకు సంపూర్ణ స్వాతంత్ర్యం" అనే నినాదాన్ని ప్రచారం చేసేవారు; ట్రేడ్ యూనియన్లలో పార్టీకి నాయకత్వ పాత్ర యివ్వడానికి తిరస్కరించేవారు.

ఈ విధంగా ఆనాడొకవైపు శ్రామిక విప్లవంయొక్క ప్రయోజనాలదృష్ట్యా జనబాహుళ్యాన్ని నడపడానికీ ఆ కర్తవ్యాలను నెరవేర్చడానికీ బలీయమైన ఒక రాజకీయపార్టీ అవసరమై యుండగా, మరొకవైపు రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన పార్టీలు, ఆ పార్టీలలో లక్షలాదిగా ఉండే పార్టీ సభ్యులు, ట్రేడ్‌యూనియన్ సభ్యులు పోరాటం జరపడానికి పూర్తిగా శక్తిహీనులై ఉండేవారు. అంతేగాక, ఆ పార్టీల నిర్మాణ బలహీనతకు, శిక్షణా రాహిత్యానికి రకరకాలైన అవకాశవాద అభిప్రాయాలు బలం చేకూర్చెవి.

ఇవీ, లెనిన్ బోల్షివిక్ పార్టీని నిర్మించ నారంభించిన నాటి పరిస్థితులు.

ఈ పరిస్థితుల్లో శ్రామిక విప్లవాన్ని నడపగల పార్టీని నిర్మించాలంటే సిద్ధాంతరీత్యాను, రాజకీయంగాను, నిర్మాణం

లోను సంపూర్ణ ఐక్యతగల పార్టీని నిర్మించాలంటే, లెనిన్ రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యను చెందిన పార్టీలలోని సిద్ధాంత, రాజకీయ అవకాశవాదాన్ని ఎదుర్కోవడం తప్పనిసరి అయింది. ముఖ్యంగా నిర్మాణం విషయంలో అట్టి అవకాశవాద మార్గాన్ని ప్రతిఘటించవలసి వచ్చింది. మొట్టమొదట నిర్మాణ సమస్యపైననే - పార్టీలో చేరడానికి అర్హతలు వగైరా - లెనిన్ గొప్ప బోల్షివిక్ పార్టీకీ, మెన్షివిక్కులకూ విభేదాలువచ్చాయి.

లెనిన్ రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యనుచెందిన పార్టీలలో నిర్మాణానికి సంబంధించిన సమస్యపైవున్న అవకాశ వాదానికి వ్యతిరేకంగా పోరాడ్డంలోనే, కార్మికవర్గానికి రాజకీయపార్టీలు అవసరంలేదనే అర్థికవాదుల, సిండికలిస్టుల సిద్ధాంతాన్ని ప్రతిఘటించడంలోనే ఆయన పార్టీనిర్మాణానికి సంబంధించిన బోల్షివిక్ సిద్ధాంతాల ప్రణాళికను తయారుచేశాడు. అందుచేత, పార్టీనిర్మాణానికి సంబంధించిన లెనిన్ సిద్ధాంతమంతా రకరకాలైన మితవాద అవకాశవాద ధోరణులకు వ్యతిరేకంగా, ఉదారవాద పోకడలకూ, సామరస్య పంథాకూ వ్యతిరేకంగా, శ్రామికవర్గ పార్టీని సామాన్య కార్మిక సంస్థ స్థాయికి దిగజార్చే సిద్ధాంతానికి వ్యతిరేకంగా, పార్టీలో నియమరహితమైన సామరస్య పంథాకు వ్యతిరేకంగా, ఐక్యతను నాశనంచేసే ముఠాలకు, ముఠాచర్యలకు వ్యతిరేకంగా జరిపిన సిద్ధాంతచర్చలలోనే నిండివుంటాయి. లెనిన్ నిర్మాణ సమస్యపై మితవాద అవకాశవాదానికి వ్యతిరేకంగా పోరాడినప్పుడు పార్టీ అంటే ఎలావుండాలో ఖచ్చితమైన అభిప్రాయాన్ని ఆయన ప్రకటించాడు. శ్రామికవర్గపార్టీ అన్నిటికంటె ఎక్కు-

వగా అభివృద్ధిచెందిన, అన్నిటికంటె ఎక్కువగా సంఘటితమైన, ఎక్కువ శిక్షణగల్గిన సైనికదళంఅనీ, అందులో అందరికంటె ఎక్కువ చైతన్యం, ధైర్యసాహసాలుగల అభ్యుదయకాముకులైన శ్రామికులే ఉండాలనీ, శ్రామికుల వర్గసంస్థలన్నిటిలో అదే అత్యున్నతమైన వర్గసంస్థఅనీ ఆయన స్పష్టంచేశాడు. శ్రామికవర్గానికి పార్టీయేగాక ట్రేడుయూనియన్లు, సహకార సంఘాలు, విద్యాసాంస్కృతిక సంస్థలు, మొదలైనవికూడా ఉన్నాయి. ప్రభుత్వం, సైన్యం మొదలైనవికూడా వుంటాయి. అయితే ఈ శ్రామికసంస్థలన్నిటిలోను పార్టీయే అత్యున్నతమైనది; అదే రాజకీయంగా యితరసంస్థలన్నిటినీ నడపగలదు.

ఈ విధంగా లెనిన్ పార్టీకీ, యితర కార్మిక సంస్థలకూ మధ్య స్పష్టమైన వ్యత్యాసం చూపాడు. అంతేగాక పార్టీ యొక్క నిర్మాణసూత్రం కేంద్రీకృత ప్రజాస్వామ్యమనీ, పార్టీకి ఉక్కుశిక్షణ ఉండాలనీ నొక్కిచెప్పాడు. లెనిన్ రెండవ అంతర్జాతీయ కార్మిక సమాఖ్యకు చెందిన పార్టీల మితవాద అవకాశవాదానికి వ్యతిరేకంగా జరిపిన పోరాటక్రమంలో పైనిర్మాణ సూత్రాలను ప్రతిపాదించాడు. అవే లెనిన్ యొక్క పార్టీ నిర్మాణ సూత్రాలలో ముఖ్యమైనవి.

ప్రధానంగా పార్టీ నిర్మాణానికి సంబంధించిన మితవాద అవకాశవాదానికి వ్యతిరేకంగానే – “అతివాద” అవకాశవాదానికి వ్యతిరేకంగా కాదు – జరిపిన పోరాటంలో ఆయన పార్టీని నిర్మించాడు. అక్టోబరు విప్లవానికి ముందున్న పరిస్థితి యిదీ. ఆ రోజుల్లో పార్టీ నిర్మాణాన్ని గురించిన “అతివాద” అవకాశవాదం యింకా బయలుదేరలేదు; బయల్దేరినా ఒక

క్రమబద్ధమైన అవకాశవాదంగా అభివృద్ధి చెందలేదు. అందు వల్లనే లెనిన్ ప్రతిపాదించిన నిర్మాణ సూత్రాలన్నీ మితవాద అవకాశవాదాన్ని ఖండించే వాదనలతోనే నిండి ఉంటాయి. అంటే, పార్టీకి కట్టుదిట్టమైన నిర్మాణం, క్రమశిక్షణ అవసరం లేదనే వాదనకు, పార్టీలో సిద్ధాంత వ్యతిరేకమైన సామరస్యం ఉండాలనే వాదనకు, ఆంతరంగిక పోరాటం ఆత్మవిమర్శన వ్యర్థమనే వాదనకు, పార్టీలో ఉదారవాదం – రాజీ పంథా ఉండాలనే వాదనకు, ట్రేడ్‌యూనియన్లకు సంపూర్ణస్వాతంత్ర్యమివ్వాలనే వాదనకు వ్యతిరేకంగా చెప్పిన వాదనలే అందులో మన కెక్కువగా కనిపిస్తాయి. లెనిన్ పార్టీని నిర్మించిన నాటి పరిస్థితుల్లో యిది అవసరం, అనివార్యం అయింది.

అయితే, చైనా కమ్యూనిస్టుపార్టీ నిర్మింపబడిన నాటి పరిస్థితులు చూస్తే, అక్టోబరు విప్లవానికి ముందు లెనిన్‌ని యెదుర్కొన్న పరిస్థితుల కవి పూర్తిగా భిన్నమని గ్రహిస్తాం.

మొదటివిషయం: చైనాపార్టీ అక్టోబరు విప్లవంతర్వాత, అంటే రష్యన్ బోల్షివిక్కులు యిదివరకే విజయాన్ని సాధించి మనకొక మార్గం చూపిన తర్వాత నిర్మింపబడింది. కనుకనే మనపార్టీ మొదటినుంచీ లెనినిస్టు సిద్ధాంతాల కనుగుణ్యంగాను, అంతర్జాతీయ కమ్యూనిస్టుసంస్థ సారథ్యంక్రింద నిర్మింపబడింది.

రెండవవిషయం: చైనాపార్టీ పుట్టినప్పటినుంచీ సిద్ధాంతంలోగాని, నిర్మాణం విషయంలోగాని రెండవ అంతర్జాతీయ కార్మిక సంస్థకు చెందిన సోషల్ డెమాక్రటిక్ పార్టీల ప్రభావానికి లోనుగా లేదు.

మూడవవిషయం: యూరపులో మాదిరిగా చైనాలో పెట్టుబడిదారీ విధానం "శాంతియుతంగా" అభివృద్ధిచెందేవశ లేదు. కార్మికవర్గం శాంతియుతంగా పార్లమెంటరీ పోరాటాల్లో పాల్గొనే అవకాశాలు లేవు. యూరపులోవలె చైనాలో సంపన్న కార్మికులంటూ లేరు.

నాల్గవవిషయం: చైనా కమ్యూనిస్టుపార్టీలో మధ్యతరగతి ప్రజలు, రైతులు ఎక్కువ నిష్పత్తిలో ఉన్నారు. సోంబేరులుకూడా ఉన్నారు.* చైనాపార్టీలో బయల్దేరిన "అతివాద", మితవాద అవకాశవాదానికి మూలం యిదే.

పై నాలుగు కారణాలవల్ల చైనా పార్టీని నిర్మించడంలో మనం మొదటినుంచీ లెనిన్ సిద్ధాంతాలనే అనుసరిస్తూ వచ్చాం; ఆయన అడుగుజాడల్లోనే నడిచాం. మనపార్టీ సభ్యులలో అధిక సంఖ్యాకులు బోల్షివిక్ పార్టీయొక్క నిర్మాణసూత్రాలలో పెక్కింటిని కంఠస్థంచేయగలరు. అంతేకాదు. సోషల్ డెమాక్రటిక్ పార్టీల సాంప్రదాయాలు మనపార్టీలో ఎన్నడూ ప్రవేశించలేదు. ఈ విధంగా మనం అనేక రాచబాటల మీదుగా ప్రయాణం చేయగలిగాం. మొదటినుంచీ మన ...టీలో ఆత్మవిమర్శన, సిద్ధాంత పోరాటం జరుగుతూనే కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని అమలు జరుపుతూనే కట్టుదిట్టమైన నిర్మాణం, ఉక్కుశిక్షణ అవసరమనే

---

* ...ర్మికులు, రైతులు, ఒడితరులు అభివృద్ధి నిరోధక ప్రభుత్వం ... భూస్వాములయొక్క, లేదా గుత్తపెట్టుబడిదారులయొక్క, ...మిని పోగొట్టుకొని, వృత్తులు కోల్పోవడంవల్ల ప్రధానంగా ...ద్వారా వారు పొట్టపోసుకొనేవారు. అట్టివారు సోంబేరు ...లు.

విషయాన్ని గుర్తిస్తూనే వచ్చాం. మన మెన్నడూ పార్టీలో మతాలను సహించి యుండలేదు. ఉదారవాదాన్ని, ఆర్థిక వాదాన్ని, ట్రేడ్ యూనియన్లు సర్వస్వతంత్రంగా ఉండాలనే వాదాన్ని మనం తీవ్రంగా ప్రతిఘటించాం. అందుచేత మన పార్టీలో ఎవరూ నిర్మాణం విషయంలో మితవాద అవకాశ వాదాన్ని బాహాటంగా క్రమపద్ధతిలో సమర్థించి యుండలేదు. పార్టీలో ఆత్మవిమర్శన, ఆంతరంగిక పోరాటం, గట్టినిర్మాణం, ఉక్కు-శిక్షణ, కార్మికవర్గానికి ప్రత్యేక రాజకీయపార్టీ-ఇవి అవసరంలేదనే అభిప్రాయాలు ట్రేడ్ యూనియన్లు సర్వస్వతంత్రంగా వ్యవహరించాలనే భావం మనపార్టీలో బహిరంగంగా పెంపొందే అవకాశంలేదు.

మన పార్టీలో సిద్ధాంత పోరాటం తగినంతగా లేదనే మాట వాస్తవమే. అయితే యిందుకు కారణం పార్టీలో ఆంతరంగిక పోరాటం అవసరంలేదనే సిద్ధాంతం ఒక క్రమ పద్ధతిలో వ్యాప్తమవడం వల్ల కాదు. మనకు సిద్ధాంతస్థాయి తక్కువగా ఉండటంవల్లనైతేనేమి, బాధ్యులైన కొందరు వ్యక్తిగత కామ్రేడ్స్ ఆత్మవిమర్శనను అణచడానికి అసాధారణ పద్ధతు లవలంబించడంవల్లనైతేనేమి సిద్ధాంత సమస్యలపై ల వ్యత్యాసాన్ని కనుగొనలేకపోవడమే యిందుకు కారణం.

అయితే, చైనాలో మనపార్టీ స్థాపింపబడినప్పటి పరిస్థితులు రెండు రకాలైన ప్రభావాన్ని కలుగ మొదటిది, మొదటినుంచీ లెనినిస్టు సిద్ధాంతాల కమ్యూనిస్టుపార్టీని నిర్మించగల అవకాశం. రెండో మనపార్టీ మొదటినుంచీ ఖచ్చితమైన ఆత్మవిమర్శన

పోరాటం కొనసాగిస్తూ వచ్చింది. కనుకనే అది ఎంతో త్వరగా అభివృద్ధి చెందగల్గింది; ఇంకా ముందుకు సాగడానికి అవకాశ మేర్పడింది.

కాని రెండవ ప్రభావం మన కామ్రేడ్స్‌ని తరచు మరో కొసకు లాక్కు వెళ్ళింది; మరోవిధమైన పొరబాటుకు కారణ మైంది. అదే ఆంతరంగిక పోరాటాన్ని అతిగా సాగించడం; ఎట్టి నిగ్రహం లేకుండా మరీ తీవ్రంగా పోరాటం జరపడం. ఇందువల్ల మన సభ్యుల్లో "అతివాద" పెడమార్గం బయల్దేరింది.

చాలమంది కామ్రేడ్స్ లెనిన్ సిద్ధాంతాలను ముక్కుకు సూటిగాను, పొరబాటుగాను అర్థంచేసుకొని, వాటిని పిడి వాదంగా మార్చివేశారు.

పార్టీ నిర్మాణం ఎంతో కేంద్రీకృతంగా ఉండడ మంటే అర్థం ఆంతరంగిక ప్రజాస్వామ్యం అవసరంలేదని, పార్టీలో ఆంతరంగిక పోరాటం ఉండాలంటే అర్థం సామరస్యం పనికిరాదని వారు భావించేవారు. శ్రామికవర్గం యొక్క అత్యు న్నతవర్గ నిర్మాణమైన పార్టీ యితర కార్మిక సంస్థలకు రాజకీయ ...యకత్వం వహించడమంటే అర్థం, ట్రేడ్ యూనియన్లు ...నైన కష్టజీవుల సంస్థలకు ఎట్టి స్వాతంత్ర్యం ఉండకూడదని ...సం. ఐక్యత, ఉక్కుశిక్షణ అంటే పార్టీ సభ్యుల ..., సొంత చొరవను, సృజనాత్మకశక్తిని చంపి ...వారి భావం.

...మంది కామ్రేడ్స్ లెనిన్ సిద్ధాంతాలను ముక్కుకు ...చేవారు. పార్టీలో ఆంతరంగిక పోరాటం ...ఉదారవాదం సామరస్యమార్గం పనికిరావనీ

వాటంగీకరించేవారు. కాని ఈసిద్ధాంతాలను ముక్కుకుసూటిగా వర్తింపచేసేవారు. ఆంతరంగిక పోరాటాలను దేశకాలపరిస్థితులతో సంబంధం లేకుండా, రాజీలేని విధంగా సాగించాలని వారి అభిప్రాయం. ఎంత కఠినంగా దాన్ని సాగిస్తే అంతమంచిదని వారి నమ్మకం. ఆంతరంగిక పోరాటం, విమర్శన ఎంత పదునుగాను, శక్తివంతంగానుఉంటే అంత ఉపయోగకరమని, వాద వివాదాలెంత నిశితంగా ఉంటే అంత ప్రయోజనకారి అని వారి అభిప్రాయం. అలా వుండకపోతే తాము ఉదారవాద పొరబాట్లు చేస్తున్నామనుకొనేవారు.

ఉదారవాద పోకడలనుంచి, సామరస్య మార్గాలనుంచి తాము బయటపడినట్లు రుజువుచేసుకోడానికి, నూటికి నూరుపాళ్లు "బోల్షివిక్కుల" మని రుజువు చేసుకోడానికి వారు పార్టీలో సిద్ధాంత వ్యతిరేక పోరాటాలు సాగించేవారు. దేశకాల పరిస్థితుల్ని దృష్టిలో వుంచుకొనేవారుకారు. ఈ విధంగా ఆంతరంగిక పోరాటాల విషయమై ఎట్టి దృక్పథంలేకుండా "రాజీలు"గాను, "పోరాటప్రవీణులు"గాను వారు తయారయారు. ఒక నియమమంటూ వారికిలేదు. "పోరాటమేవ…"గా పెట్టుకున… వారు వ్యవహరించేవారు. కేవలం పోరాటంకోసమే… వారు. ఇది శ్రామికవర్గ సభ్యులలో అవమానకరమై… అట్టివారెన్నటికీ నూటికి నూరుపాళ్ళు "బోల్షివిక్కు… లరు. పై పెచ్చు బోల్షివిజానికి వారు తలవొంపు… వారయారు; బోల్షివిక్కుల పదజాలాన్ని, పద్ధతిని… కొని పార్టీలోపల అవకాశవాదాన్ని అనుసరించ…

పార్టీలో ఆంతరంగిక పోరాటం సిద్ధాంతాలపై జరగాలని గాని, ఒక పోరాటంయొక్క లక్ష్యాన్ని నిర్వచించడమే దాని ప్రయోజనమనిగాని, ఆ లక్ష్యాన్ని చేరుకొనేందుకు అవలంబించవలసిన పోరాటపద్ధతిని నిర్ణయించడమే దాని వుద్దేశమనిగాని చాలమంది కామ్రేడ్స్ గుర్తించలేదు.

ప్రస్తుత పాలసీకి సంబంధించిన, ఆచరణకు మాత్రమే సంబంధించిన సమస్యలపై పార్టీలో మనతో భేదించేవారితో ఒడంబడికకు రావచ్చునని, అలా రావాలని యీ కామ్రేడ్స్ తెలుసుకోలేదు. సిద్ధాంతానికి సంబంధించిన సమస్యలపై మాత్రం- అనగా పోరాటంయొక్క లక్ష్యాన్ని నిర్వచించే సమస్యలపైనా, ఆ లక్ష్యాన్ని చేరుకొనేందు కవలంబించవలసిన పోరాట పద్ధతులపైనా మాత్రమే వ్యతిరేకాభిప్రాయాలు గలవారితో రాజీలేని పోరాటం సాగించాలని వారు తెలుసుకోలేదు.

లెనిన్, స్టాలిన్‌ల పార్టీలో సాంప్రదాయికంగా అవలంబింపబడుతూన్న పని విధానాన్ని మన కామ్రేడ్స్‌లో చాలమంది యింకా అలవరచుకోలేదు. ఒడంబడిక చేసుకోవలసిన సమస్యలపై వారు సిద్ధాంత వ్యతిరేక పోరాటాలు సాగిస్తూ వచ్చారు. తత్ఫలితంగా వారు పోరాడని సమస్య అంటూ లేదు; ప్రతి సమయంలోను, ప్రతి వ్యక్తిమీద పోరాడ్డమే వారు పనిగా పెట్టుకున్నారు. తమతో భేదించిన వారందరిమీద పోరాడుతూ, అందరూ తమ అభిప్రాయాలతో ఏకీభవించి తీరాలని పట్టుబడుతూ వచ్చారు. ఏ విషయంమీదా, ఏ పరిస్థితుల్లోనూ వారు రాజీ పడేవారుకారు. ప్రతి వైరుధ్యాన్ని

రాజీలేని పోరాటంగా, పోరాటమే అన్నిటికీ పరిష్కారమార్గంగా పరిగణించేవారు. ఇది వారి నియంతృత్వానికి నిదర్శనం.

సిద్ధాంతమంటే ఏమిటో, సిద్ధాంతానికి సంబంధించిన సమస్య లెట్టివో, పార్టీ అనుసరించవలసిన వ్యూహం - ఎత్తుగడలు అంటే ఏమిటో చాలమంది కామ్రేడ్స్‌కి తెలియదు. సిద్ధాంతాలపైన, వ్యూహరచనపైన, ఎత్తుగడలపైన వచ్చే భేదాభిప్రాయాలను అవగాహన చేసుకొని పోరాటం సాగించడమెలాగో వారికి అసలే తెలియదు. వారిలో సిద్ధాంత పరిజ్ఞానం చాల తక్కువ; రాజకీయ అనుభవం పరిమితం. అత్యంత ప్రాముఖ్యతగల సమస్యలను అర్థంచేసుకొని వాటిపై పోరాటం జరపగలశక్తి వారికింకా లేదు. అయితే ఆంతరంగిక పోరాటం ఉండితీరాలనీ, పోరాటాలు జరపకపోవడం తప్పుఅనీ కొన్ని సూత్రాలుమాత్రం వల్లించేవారు. ఈ విధంగా ప్రధాన సమస్యలను వారు అర్థంచేసుకోకపోయినప్పటికీ, ఆ సమస్యలకు సంబంధించిన విషయాలను ముందుకు తీసుకురాలేకపోయినప్పటికీ, పోరాటంమాత్రం సాగించేవారు. వ్యక్తిగత విషయాలమీదా, వ్యక్తిగత సమస్యలమీదా మాత్రమే వారు తమ దృష్టిని కేంద్రీకరిస్తూ, తమతో భేదించేవారిపై సిద్ధాంత వ్యతిరేకమైన, అర్థరహితమైన పోరాటం సాగిస్తూండడంవల్ల వారు కామ్రేడ్స్ మధ్య అనైక్యత, పరస్పర ద్వేషాలు, నిర్మాణ చీలికలు తీసుకొచ్చేవారు. ఇట్టి దుష్టలక్షణాలు మన పార్టీ ఆంతరంగిక పోరాటంలో ప్రత్యక్షంగా కనబడ్డాయి.

చైనా పార్టీ ఆంతరంగిక పోరాటాలలో అన్నిటికన్న ప్రమాదకరమైన పెడమార్గం యిదే. (ఇలాంటి పెడమార్గం

యితర దేశాల పార్టీలలోకూడ ప్రత్యక్షమైన మాట నిజమే అయినప్పటికీ). మరీ తీవ్రంగాను, ఎట్టి పరిమితులూ లేకుండాను జరిగిన ఆంతరంగిక పోరాటం యిది. ఇది ఆంతరంగిక పోరాటాల్లో "అతివాద" అవకాశవాదానికి, నిర్మాణ సమస్యలపై "అతివాద" అవకాశవాదానికి దారి తీసింది (దీనివల్ల పార్టీలో ప్రజాస్వామ్యం నశిస్తుంది, సిద్ధాంత సమస్యలపై ఐక్యత ప్రాతిపదికగా ఉండవలసిన పార్టీలో సామరస్యం అంతరిస్తుంది. ట్రేడ్ యూనియన్లకు, యితర ప్రజాసంస్థలకు కొంచెం స్వాతంత్ర్యమైనా లేకుండా చేస్తుంది; పార్టీ సభ్యులలో ఉండవలసిన చొరవను, సృజనాత్మక శక్తిని, వ్యక్తిత్వాన్ని చంపి వేస్తుంది). ఈ పెడమార్గం చైనాపార్టీయొక్క ప్రత్యేక పరిస్థితుల్లో, ప్రత్యేక పరిసరాల్లో తలయెత్తింది.

ఈ సందర్భంలో నేనొక విషయం చెప్పదలచుకున్నాను. లెనిన్ అక్టోబరు విప్లవంతర్వాత పార్టీలో బయల్దేరిన "అతివాద" అవకాశవాదానికి వ్యతిరేకంగా జరిపిన సిద్ధాంతాత్మక పోరాటాన్ని మన కామ్రేడ్స్ చాలమంది గుర్తించలేరు. అక్టోబరు విప్లవం తర్వాత రష్యన్ పార్టీలో "అతివాద" కమ్యూనిస్టుల ముఠా ఒకటి బయల్దేరింది. ఈ ముఠా బ్రెస్ట్ - లిటోవ్స్క్ సంధిని వ్యతిరేకించారు. ఆ తర్వాత ట్రేడ్ యూనియన్ సమస్యపై తగాదా ఏర్పడింది. అక్టోబరు విప్లవానికిముందు బోల్షివిక్ పార్టీలో ఒటోజోవిస్టులంటూ, పైకి "అతివాదులు"గా కనబడేవారు కొందరుండేవారు. కాని త్వరలోనే వారు ఓడింపబడ్డారు. అందుచేత వారు బ్రెస్ట్ - లిటోవ్స్క్ సంధినాటి

"అతివాద" కమ్యూనిస్టులంత ప్రమాదకారులుగా పరిణమించ లేదు (వీరినికూడా లెనిన్ త్వరలోనే ఓడించాడు).

కాని పశ్చిమ యూరపుదేశాల్లో తిరిగి "అతివాద" కమ్యూనిజం తలయెత్తింది. "ఎట్టి రాజీలు పనికిరావు" అనే నినాదాన్ని వారు తీసుకున్నారు. పార్లమెంట్లలో స్థానం కూడదని వారు వాదించేవారు. చట్టబద్ధ పోరాటాలకు, సోషల్ డెమాక్రటిక్ పార్టీలలోని అతివాద గ్రూపులతో ఐక్యతకు వారు వ్యతిరేకులు. ఈ పరిస్థితుల్లో లెనిన్ 1920 ఏప్రిల్‌లో "అతివాద కమ్యూనిజం: బాల్యారిష్టం" అనే పుస్తకం వ్రాశాడు. పై పెడమార్గాలను సరిదిద్దడమే ఆ పుస్తకంయొక్క ఉద్దేశం.

అక్టోబరు విప్లవం జయించిన తర్వాత, అంతవరకూ శ్రామికవర్గం అధికారాన్ని హస్తగతం చేసుకోజాలదని వాదించిన వారందరినీ వాస్తవ పరిస్థితి ఎదుర్కొంది. ఇది మితవాద అవకాశవాదాన్ని చావుదెబ్బ తీసింది.

ఇట్టి పరిస్థితుల్లో తలయెత్తింది "అతివాద" అవకాశవాదం. విప్లవం ఒక్కరాత్రిలో జయించగల్గుతుందని, వంకర టింకర మార్గాల అవసరం లేదని వారి వాదన.

ఇలాంటి అభిప్రాయాలే చైనా పార్టీలో కూడ ప్రవేశించాయి. కొన్ని సందర్భాలలో అవి పార్టీమీద అధిక ప్రాబల్యం సంపాదించాయి. అట్టి పొరబాట్లు చేసినవారు లెనిన్ రచించిన "అతివాద కమ్యూనిజం: బాల్యారిష్టం" అను గ్రంథం యొక్క ప్రాముఖ్యతను నిర్లక్ష్యం చేశారు. రాజకీయంగా వారు వంకర టింకర మార్గాలకు వ్యతిరేకులు; ఆలస్యాన్ని సహించరు.

కొద్దిమందితో కూడిన అగ్రగామిదళం శత్రువుమీద దుందుడుకు దాడులు చేయవచ్చునని వారు భావించేవారు. ప్రజలు వారితో కలిసివస్తున్నారా లేదా అనే ప్రసక్తి వారికి లేదు. ఈ తమ విధానాన్ని వ్యతిరేకించే వారందరికీ "మితవాద అవకాశవాదు"లని నామకరణం చేసేవారు.

రాజకీయ సమస్యలపై ఉత్పన్నమయే మితవాద, "అతి వాద" అవకాశవాదం నిర్మాణ సమస్యలపైకూడ మితవాద, "అతివాద" అవకాశవాదానికి దారితీస్తుంది. చైనాపార్టీ కొన్ని దశల్లో రాజకీయంగా మితవాద, "అతివాద" పొరబాట్లు చేయ డంవల్ల నిర్మాణసమస్యలపై కూడ అలాంటి పొరబాట్లేజరిగాయి. ముఖ్యంగా అంతర్యుద్ధకాలంలో (1927-36) మనం చేసిన "అతి వాద" దుందుడుకు తప్పులవల్లనే నిర్మాణ సమస్యలపై అతి ఉధృతమైన అంతరంగిక పోరాటాలు పార్టీలో జరిగాయి.

అందువల్ల చైనాపార్టీలో ఆంతరంగిక పోరాటాన్ని గురించి మూడురకాల పెడమార్గాలున్నాయని చెప్పవచ్చు. మొదటిది పార్టీలో ఉదారవాదం, సామరస్యపంథా; రెండవది ముక్కుకుసూటిగాను, అతిగాను సాగించే ఆంతరంగిక పోరాటం, నిర్మాణ సమస్యలపైనా, ఆంతరంగిక పోరాటంలోనూ "అతి వాద" అవకాశవాదం; మూడవది పార్టీలో సిద్ధాంత వ్యతిరేక తగాదాలు, పోరాటాలు.

ఈ మూడు రకాల పెడమార్గాలు, వాటిలోని విష యానికి సంబంధించినంతవరకు, ఒకేవిధమైనవి. కారణమేమంటే సిద్ధాంత వ్యతిరేక తగాదాలు, పోరాటాలు, అతిగా సాగించే పోరాటాలు, పార్టీలో ఉదారవాదం మార్క్సిస్టు - లెనినిస్టు

సిద్ధాంతాలకు పూర్తిగా వ్యతిరేకం వాటి స్వరూపాన్నిబట్టి మాత్రమే పై విధంగా మూడురకాలుగా వర్గీకరణచేయడం జరిగింది.

ఇవీ, చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడిన నాటి ప్రత్యేక పరిస్థితులు, ఆంతరంగిక పోరాటంలో బయల్దేరిన పెడ మార్గాలు.

# 2

## ముక్కుకు సూటిగాను, అతిగాను జరిపే అంతరంగిక పోరాటం

కామ్రేడ్స్ !

పార్టీయొక్క అంతరంగిక పోరాటంలో మూడు రకాలైన పెడమార్గాలున్నాయని పైన చెప్పాను; వాటిలో మొదటి తరగతికి చెందిన ఉదారవాదాన్ని గురించి నేనీ రోజున చర్చించ దలచుకోలేదు. ప్రస్తుతం మన పార్టీలో ఉదారవాదం ప్రమాదకరంగా పరిణమించలేదని నేను చెప్పను; దానికి వ్యతిరేకంగా పోరాడ్డం ముఖ్యంకాదనికూడా నేను చెప్పను. అనేక సమస్యలలో యీ ఉదారవాదం ఏయే రూపాలు ధరిస్తోందో మన కామ్రేడ్స్ పూర్తిగా అర్థంచేసుకున్నారని కూడా నేననను. వారలా అర్థంచేసుకోలేదనే నా అభిప్రాయం. అయినప్పటికీ, నేనీ రోజున యీ సమస్యపై మాట్లాడబోవడంలేదు. మరొక రోజున అవకాశం దొరికినప్పుడు మాట్లాడుతాను. ఇప్పుడు నేనొక విషయం మాత్రమే చెబుతాను. మనపార్టీలో ఉదారవాద ధోరణి యీ మధ్యనే బయల్దేరింది. అనేక సందర్భాలలో యిదే ప్రధాన పోకడగా కూడ తయారయింది. అంతేగాక పార్టీలో సిద్ధాంత పోరాటం తగినంతగా అభివృద్ధి చెందలేదు. ఈ కారణాలవల్ల అనేక పొరబాటు ధోరణులు, అవలక్షణాలు సకాలంలో సరిదిద్దబడలేదు; పార్టీ శిక్షణ క్రమక్రమంగా సన్నగిలింది. ఇది చాల తప్పు. మనపార్టీ యీ మధ్య చాలమంది విద్యాధికుల్నీ, బూర్జువా ఉదారవాదం జీర్ణించిన కొత్తసభ్యుల్నీ

సిద్ధాంత-రాజకీయ-నిర్మాణ సమస్యలపై రాటుదేరని వారినీ, శ్రామిక వర్గపార్టీకి వుండవలసిన ఉక్కు శిక్షణ నలవరచుకోని వారినీ, చేర్చుకోవడంవల్ల యిలా జరిగింది. అంతేకాదు; ఇది వరలో "అతివాద" పొరబాట్లు చేసినవారూ, ఆంతరంగిక పోరాటం అతిగా జరగాలన్న వారూ మరొక చివరకు వెళ్ళి ఉదార వాదమనే మితవాద పొరబాట్లు చేశారు. అంతేకాక, దీర్ఘకాలం కొనసాగిన ఐక్యసంఘటన దశలో పెట్టుబడిదారీ వర్గం పార్టీమీద తనపలుకుబడిని ప్రసరింపజేసినప్పుడు అవకాశం కూడా ఎక్కువయింది. పార్టీలో ప్రచ్ఛన్న రూపం ధరించిన విప్లవ ప్రతీఘాతకులు ఉదారవాదాన్ని సర్వవిధాలా బలపరచడానికి ప్రయత్నించారు. వీటన్నిటివల్ల మన పార్టీలో ఉదారవాదం బాగా పెంపొందింది. మన సభ్యుల్లో పార్టీ చైతన్యాన్ని గట్టిపరచాలంటే, యీ పెడమార్గాన్ని తీవ్రంగా ఎదుర్కోవాలి. ఉదాహరణకు, కొందరు కామ్రేడ్స్ యితరుల పొరబాట్ల విషయంలో మౌనం వహిస్తూ వచ్చారు. తమ పొరబాట్లను యితరులు ఎత్తిచూపుతారనే భయంవల్ల వారలా ఉపేక్ష వహించారు. ఒకరి తప్పుల నొకరు కప్పిపెట్టుకోటానికి వారు తమ స్నేహితుల పొరబాట్లను ఎత్తిచూపే వారుకారు. వారియెదుట ఒక్కమాటైనా మాట్లాడకుండా, యితరులతోమాత్రం బాధ్యతారహితమైన మాటలనేకం చెప్పేవారు. బాధ్యతారహితంగా విమర్శనలు చేసేవారు. చాడీలు చెప్పేవారు. గుసగుసలాడేవారు. పార్టీలో యిలాంటి లక్షణాలు ఎక్కువగా ప్రవేశించాయి. అంతేకాదు. ఈ మధ్య మరొక ప్రమాదకరమైన పోకడకూడ పార్టీలో ప్రవేశించింది. ఇతరులు తమ

లోపాలనుగురించి, పొరబాట్లనుగురించి పై నాయకులకు రిపోర్టు చేస్తారని భయపడేవారు కొందరున్నారు. ఇతరులు తమ మీద ఆరోపణలు చేస్తారని వారు విపరీతంగా భయపడతారు; ఒకవైపు వారు తెలిసిఉండీ పొరబాట్లుచేయడం జరుగుతోంది. కాని మరోవైపు ఆ పొరబాట్లనుగురించి యితరులు పార్టీకి గాని, పై నాయకులకుగాని రిపోర్టుచేయకుండా, తమ్ము పార్టీ సమావేశాల్లో విమర్శించకుండా నిరోధించడానికి ప్రయత్నిస్తారు. వారు కొన్ని పొరబాట్లు, చేయకూడనిపనులు చేసి యితరులు వాటిని సరిదిద్దకుండా చేయడానికి వాటిని దాచిపెట్టుకుంటారు. అంటే తమ వ్యాధిని వారు కప్పిపెట్టుకొంటున్నారన్నమాట ; దాన్ని బాగుచేసుకోడానికిష్టపడ్డం లేదన్నమాట. తమ పొరబాట్లను బహిరంగ మొనర్చుకోకపోతే వాటిని సరిదిద్దుకోవడ మసంభవమని వారు గుర్తించడం లేదు. ఈ పొరబాట్లు ఒక నిధికంటె అమూల్యమైనవిగా భావించి, వాటినెంతో జాగ్రత్తగా దాచిపెట్టుకొంటున్నారు. కనుకనే వారు తమ పొరబాట్లను యితరులు పరిశీలించకుండా చేయడమే కాక, యితరుల నోళ్ళను కట్టివేయడానికి కూడా ప్రయత్నిస్తారు ; ఇతరులు తమ పొరబాట్లను గురించి పార్టీకిగాని, పై నాయకులకుగాని రిపోర్టు చేయకుండా ఆటంకపరుస్తారు. ఈ విధంగా వారు వారు పార్టీ పద్ధతుల్లోకూడా తమ్ము విమర్శించే హక్కును యితరులనుంచి అపహరిస్తున్నారు. "నువ్వు పై నాయకులకు రిపోర్టుచేస్తే, నువ్వే తర్వాత విచారించవలసివస్తుంది-జాగ్రత్త" అని వారు యితరుల్ని బెదిరిస్తారు. ఇట్టివారు పై నాయకులకు రిపోర్టుచేసినవారిని తీవ్రంగా ద్వేషిస్తారు. దాన్ని వారు మన

స్సులోవుంచుకొని, ప్రతీకారంకోసం ఎదురుచూస్తూ ఉంటారు. ఇవన్నీ పార్టీ చైతన్యాన్ని పూర్తిగా కోల్పోయినవారి లక్షణాలు. ఇట్టివారు పార్టీలో దుశ్చర్యలు చేయడానికి పై కమిటీలకూ, పార్టీ సభ్యులకూ మధ్యగల సంబంధాన్ని తెగగొట్ట పూనుకుంటారు. అందుచేత, ఇట్టి ధోరణులను మనం కఠినంగా నిషేధించాలి.

ఏ పార్టీ సభ్యుడైనా సరే యితర పార్టీ సభ్యులు పొరబాటు చేసినప్పుడుగాని, పార్టీకి హానికరమైన పనులు చేసినప్పుడుగాని, వాటిని గురించి పార్టీకి, పై నాయకులకు రిపోర్టు పంపాలి. అలా పంపకపోవడం సరియైన పద్ధతికాదు. తన పొరబాట్లనుగురించి యితరులు పార్టీకి, పై నాయకులకు రిపోర్టు చేయకుండా ఆటంకపరచడం పూర్తిగా న్యాయవిరుద్ధమైన పద్ధతి. అట్టి పద్ధతిని పార్టీలో సహించకూడదు. పైకమిటీలు అట్టి రిపోర్టులు చూడగానే, వాస్తవ విషయాలను కూలంకషంగా పరిశీలించి, అతి జాగ్రత్తగా సమస్యను పరిష్కరించ పూనుకోవాలి. పాక్షికరిపోర్టుల ఆధారంమీద తొందరగా నిర్ణయాలకు రాకూడదు.

మనపార్టీలో సక్రమమైన సిద్ధాంతపోరాటం జరిగేటట్లు చూడాలని యిదివరకే నిర్ణయింపబడింది. అందుచేత మనం ఉదారవాదాన్ని ఖచ్చితంగా వ్యతిరేకించాలి. ఏయే పార్టీ యూనిట్లలో ఉదారవాదానికి సంబంధించిన పొరబాట్లు మరీ ప్రమాదకరంగా పరిణమించాయో, ఆ పొరబాట్లను సరిదిద్దడానికి వాస్తవఘటనల ఆధారంతో నిర్దిష్టమైన సిద్ధాంత పోరాటం జరపాలి. కామ్రేడ్ మావ్-సె-టుంగ్ చాల సంవత్సరాలక్రితం

ఉదారవాదాన్నిగురించి ఒక చక్కని వ్యాసం వ్రాశాడు. అందులో ఆయన పదకొండు రూపాలలో ఉదారవాదం వ్యక్త మవుతుందని నిరూపించాడు. ఆ వ్యాసం నేటి పరిస్థితులకుకూడా చక్కగా వర్తిస్తుంది. మీరంతా దాన్ని చక్కగా అధ్యయనం చేయాలి. అంతేగాక పార్టీ నిర్మింపబడేటప్పుడుకూడ ఉదార వాదాన్ని గురించి పూర్తియైన చర్చలు జరగుతాయి. అందు వల్లనే నేనీరోజున దాన్నిగురించి మాట్లాడదలచుకోలేదు. రెండవ, మూడవ పెడమార్గాల్ని గురించి మాత్రమే మాట్లాడదలచు కున్నాను. ఎందుచేతంటే, యీ రెండుపెడమార్గాలను గురించి పార్టీలో ఇంతవరకు యెవరూఒక క్రమపద్ధతిని చర్చించి యుండలేదు.

పార్టీలో ముక్కుకు సూటిగాను అతిగాను జరిగే ఆంత రంగిక పోరాటం ఏయే రూపాల్లో బహిర్గతమవుతోంది?

ఒకటి: స్థానిక పార్టీ యూనిట్లలోను, సైనిక దళాల లోని పార్టీ యూనిట్లలోను "పోరాట సమావేశా"లని పిలువ బడేవి ఎడతెగకుండా జరుగుతున్నాయి. పార్టీతో సంబంధంలేని సంస్థలలోకూడా-ఉదాహరణకు ప్రభుత్వ సంస్థలలోనూ, ప్రజా సంస్థలలోనూకూడా "పోరాట సమావేశాలు" ఎడతెగకుండా జరుగుతున్నాయి. ఇట్టి "పోరాట సమావేశాలు" ముందుగానే ఏర్పాటు చేయబడతాయి. నాటి ప్రధానోద్దేశం పార్టీ పనిని సమీక్ష చేయడంకాదు. ఒకానొక వ్యక్తిమీద దాడిచేయడాని కవి జరుగుతాయి. మొట్టమొదట "వివాదాస్పదమైన సమస్య"పై పోరాటం జరగడానికి బదులు "ఒక వ్యక్తికి వ్యతిరేకంగా" పోరాటం జరుగుతుంది. మరోవిధంగా చెప్పాలంటే, ఈపోరాటం

ప్రధానంగా కొన్ని సిద్ధాంతాలకు వ్యతిరేకంగానో, మూల సూత్రాలకు వ్యతిరేకంగానో కాకుండా, ఒక వ్యక్తికి వ్యతిరేకంగా జరుగుతుంది. "ఫలానా లీ అనే వ్యక్తికి వ్యతిరేకంగా, లేకచాంగ్ అనే వ్యక్తికి వ్యతిరేకంగా" జరిగే ఈపోరాటంయొక్క ఉద్దేశం ఆ వ్యక్తిమీద దెబ్బతీయడం. అందుచేత యీ"పోరాట సమావేశం" ప్రధానంగా ఒక కామ్రేడ్‌పై విచారణ జరిపే సమావేశంగా పరిణమిస్తుంది. దాని ఉద్దేశం కొన్ని సమస్యలను సిద్ధాంతరీత్యా కాకుండా, నిర్మాణ పద్ధతుల్లో పరిష్కరించ పూనుకోనడం, బెడదగా తయారైన కొందరిని, లేదా తమ అభిప్రాయాలను వదులుకోనివారిని (అట్టి అభిప్రాయాలు తప్పు అభిప్రాయాలు కాకపోవచ్చు) హడలగొట్టి లొంగ తీసుకోవడం. అంతేకాదు. ప్రతి "పోరాట సమావేశం"లోను ఏ యే వ్యక్తులమీద పోరాటం జరుగుతుందో ఆ వ్యక్తులలో అధిక సంఖ్యాకులమీద చర్య తీసుకోవడంకూడా జరుగుతుంది. ఇట్టి పోరాట పద్ధతి సరియైనదికాదని వేరే చెప్పనవసరంలేదు.

ఎందువల్ల ?

మొదటికారణం, "పోరాట సమావేశం" అనే శబ్దమే సరియైనది కాదు. "పోరాట సమావేశాల"తోబాటు "పోరాటేతర సమావేశాలు"కూడా ఉంటాయని మనం చెప్పగలమా ? కొన్ని సమావేశాలు ప్రత్యేకంగా పోరాటం జరపడాని కేర్పాటు చేయబడతాయనీ, కొన్నిటిలో ఎట్టి పోరాటం జరగదనీ, మనం భావిస్తే బోలెడు సిద్ధాంత గందరగోళం సంభవిస్తుంది. దీన్నిబట్టి చాలమంది కామ్రేడ్స్ పోరాటంయొక్క సార్వజనిక స్వభా

వాన్ని అర్థం చేసుకోలేదని స్పష్టమవుతోంది. వారు పోరాటాన్నీ శిక్షణనూ యాంత్రికంగా (మెకానికల్‌గా) వేరుచేసి చూస్తున్నారు.

పార్టీలో ఆంతరంగిక పోరాటంయొక్క ఉద్దేశం పార్టీకి శిక్షణ యివ్వడం, తప్పులుచేసిన, కామ్రేడ్స్‌ని సరిదిద్ది వారిని విజ్ఞానవంతులుగా చేయడం. అందువల్ల ఆంతరంగిక పోరాటం ఒక శిక్షణ (ఎడ్యుకేషన్)అని చెప్పవచ్చు. అంతేకాదు పార్టీలో శిక్షణ ఒకవిధమైన అంతరంగిక పోరాటం. అందుచేత పోరాటాన్నీ, శిక్షణనూ వేరుచేయడానికి వీలులేదు. ఆంతరంగిక పోరాటం ఒకవిధమైన శిక్షణ; అలాగే శిక్షణకూడా ఒకవిధమైన ఆంతరంగిక పోరాటం. ఈ రెంటింటినీ యాంత్రికంగా విడదీయడం చాలా తప్పు.

అంతేకాదు. ఈ విధమైన "పోరాట సమావేశాలు" స్టెరియన్ ధోరణికీ, క్యాడర్లమీద దాడిచేసే తప్పుడు విధానానికీ ప్రత్యక్షరూపాలు. వాటి వుద్దేశం పొరబాట్లుచేసే కామ్రేడ్స్‌ని ఎడ్యుకేట్ చెయ్యడం, రక్షించడం, వారికి సహాయం చేయడంకాదు; వారిమీద దండయాత్రలు సాగించడమే వాటి వుద్దేశం; వ్యక్తులమీద పోరాటం జరపడమే వాటి వుద్దేశం; సిద్ధాంత విభేదాలపట్ల అవి ఉపేక్షవహిస్తాయి. అందుచేత అట్టి "పోరాట సమావేశాలు" పార్టీలో నిజమైన సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ ఐక్యతనుగాని, ఆచరణలో ఐక్యతనుగాని పెంపొందించవు. పైపెచ్చు అవి తరచు సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ విభేదాలను, ఆచరణలో వచ్చే విభేదాలను ఎక్కువ చేస్తాయి. పార్టీలో అనైక్యతను, అపసవ్య పోరాటాలను తీవ్ర

మొనరుస్తాయి. సెక్టేరియన్ ధోరణి పెరగడానికి అవి సహాయ పడతాయి. అట్టి "పోరాట సమావేశాలను" పార్టీతో సంబంధంలేని సంస్థలలో జరపడం మరీతప్పు.

రెండు: ముక్కుకు సూటిగాను, అతిగాను జరిగే ఆంతరంగిక పోరాటం యీ క్రింది రూపాల్లోకూడా ప్రత్యక్షమవుతుంది. కొంతమంది కామ్రేడ్సు, పార్టీలో ఎంత తీవ్రమైన అంతరంగిక పోరాటం జరిపితే అంతమంచిదని భావిస్తారు. వారి అభిప్రాయం ప్రకారం, వివాదాస్పదమైన సమస్యను ఎంత తీవ్రరూపంలోముందుపెడితే, ఎన్ని ఎక్కువ ఆరోపణలు చేస్తే అంతమంచిది. ఎంతఘాటైన శబ్దాలు ప్రయోగిస్తే, ఎన్ని ఎక్కువ పేర్లుపెడితే, ఎంత కఠినంగా విమర్శిస్తే అంత మంచిది. ఎంత క్రూరంగాను, ఎంత మోటుగాను ప్రవర్తిస్తే అంత మంచిది; ఎంత గట్టిగా కేకలుపెడితే, మొగం ఎంత పొడుగుచేసుకుంటే, పళ్ళు ఎంత గట్టిగా కొరికితే అంత మంచిది. ఇలా వ్యవహరించేవారు "అందరికంటె తామే ఎక్కువ విప్లవకారుల" మనుకుంటారు. వారు ఆంతరంగిక పోరాటాల్లోను, ఆత్మవిమర్శనలలోను యుక్తాయుక్త విచక్షణను చూపరు. కొన్ని హద్దులలో మెలగాలని తెలుసుకోరు. హద్దులులేకుండా వారు పోరాటం సాగిస్తారు. ఇది పూర్తిగా పొరబాటు పద్ధతి అని వేరే చెప్పనవసరంలేదు.

మూడు: పార్టీలో ఆంతరంగిక పోరాటం అంటే అర్థం ప్రధానంగా సిద్ధాంత ఐక్యత ఏర్పడితేనే రాజకీయ నిర్మాణ ఐక్యత, ఆచరణలో ఐక్యత ఏర్పడతాయని వారు తెలుసుకోలేరు. వివాదాస్పదమైన సమస్యలను నిర్మాణ రీత్యాగాని,

ఆచరణలోగాని పరిష్కరించేముందు వాటిని సిద్ధాంత రీత్యా పరిష్కరించాలని వారు గ్రహించరు. ఇతరుల సిద్ధాంతాలను సరిదిద్దాలన్నా, ఇతరులు దీర్ఘకాలంగా నమ్మే విశ్వాసాలను మార్చాలన్నా, వారిలో లోతుగా పాతుకుపోయిన భావాలను సంస్కరించాలన్నా మార్గం యిదే. ఈ పని కొన్ని శబ్దప్రయోగాల ద్వారానో, "పోరాట సమావేశాల"ద్వారానో జరుగుతుందనుకోవడం పొరబాటు. నిరంకుశ పద్ధతులద్వారా అసలే జరగదు. ఓపికతో నచ్చచెప్పడంద్వారాను, శిక్షణ గరపడం ద్వారాను, అనేక విధాలైన క్లిష్ట పోరాటాలద్వారాను, తరిఫీదు యివ్వడం ద్వారాను, విప్లవ పోరాటాల్లో పాల్గొనేట్లు చేయడంద్వారాను మాత్రమే యిది సాధ్యం: ఆంతరంగిక పోరాటంలో ప్రధాన విషయమిదేనని చాలమంది కామ్రేడ్స్‌కి తెలియదు. ఆంతరంగిక పోరాటమంటే పార్టీ నిర్మాణంలో వచ్చే వైరుధ్యాలని-వారి అభిప్రాయం; లేదా పోరాడుకోవడం, దూషించుకోవడం, దెబ్బలాడుకోవడం, కుస్తీలు పట్టడమే ఆంతరంగిక పోరాటమని వారి నమ్మకం. వారు నిజమైన ఐక్యత కోసం పనిచేయరు; సిద్ధాంత ప్రాతిపదికపై సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించరు. సులభమార్గాలద్వారా, యాంత్రిక పద్ధతుల ద్వారా, నీచమార్గాల ద్వారా సిద్ధాంత విభేదాలను పరిష్కరించ పూనుకుంటారు. ఇది పూర్తిగా పొరబాటని వేరే చెప్పనవసరంలేదు.

ఇట్టి కామ్రేడ్స్ సిద్ధాంత విభేదాలను పరిష్కరించడం ద్వారా, పొరబాటు ధోరణులను సరిదిద్దడం ద్వారా పార్టీలో ఐక్యతను సాధించడానికిగాని, దాన్ని రక్షించడానికిగాని

పూనుకోరు. పైగా వారు సులభమైన నిర్మాణ పద్ధతుల ద్వారానో, నిరంకుశ పద్ధతుల ద్వారానో, పార్టీ సభ్యుల్ని శిక్షలకు గురిచేయడంద్వారానో ఐక్యతను సాధించడానికి, దాన్ని రక్షించడానికి ప్రయత్నిస్తారు. తత్ఫలితంగా వారు పొరబాటుగాను, అతిగాను ఆంతరంగికపోరాటాలు జరుపుతారు. అందుచేత వారు కామ్రేడ్స్‌ని సిద్ధాంత ప్రాతిపదికపై జాగ్రత్తగా ఓపికతో ఒప్పించడానికిబదులు సులభమైన నిర్మాణ పద్ధతులద్వారా, శత్రు మార్గాలద్వారా, ప్రభుత్వ చర్యలద్వారాకూడ కామ్రేడ్స్‌ను అణచి వారిని లోబరచుకుంటారు. కామ్రేడ్స్ విషయంలో విచక్షణారహితంగా కొన్ని నిర్మాణాత్మక నిర్ణయాలుచేసి, శిక్షలకు గురిచేస్తారు. అంతేకాదు. న్యాయశాస్త్రం ఎదుట అందరూ సమానులే అను బూర్జువా సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని పార్టీసభ్యుల్ని నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తారు, అంటే, తప్పుచేసిన పార్టీసభ్యు లెలాంటివారో, వారు తమ పొరబాట్లను అంగీకరించి వాటిని సరిదిద్దుకొన్నారో లేదో అను విషయాన్ని గ్రహించకుండా, పార్టీ నిబంధనావళిలోని కఠిన శిక్షలకు గురిచేస్తారు. ఈ విధంగా పార్టీలో శిక్షలు విధించేపద్ధతి ప్రవేశపెట్టబడింది. ఇట్టివారు తరచుగా పార్టీపనిని చురుగ్గా కొనసాగించే ఉద్దేశంతో ఈ విధమైన పోరాటాలు సాగిస్తారు. ఎవరి మీద పోరాటం సాగించాలో వారికోసం ఉద్దేశపూర్వకంగా వెతుకుతూ ఉంటారు. వారు అవకాశవాదులని ముద్రవేసి, వారిమీద పోరాటం సాగిస్తారు. ఇతర పార్టీ సభ్యులు కష్టపడి పనిచేసేట్లు, తమ విధులను సక్రమంగా నెరవేర్చేట్లు చేయుడానికి ఒకరినో, కొద్దిమందినో బలియిస్తారు. వారి లోపా

లను గురించి, పౌరబాట్లను గురించి ఉద్దేశపూర్వకంగా భోగట్టా సేకరించి, కొన్ని అనుచితమైన మాటలను, చేతలను యాంత్రికంగా నోట్ చేసుకుంటారు. అట్టి లోపాలను గురించి, పౌరబాట్లను గురించి సందర్భశుద్ధిలేకుండా పరిశీలనలు సాగిస్తారు. ఇవన్నీ ఆ కామ్రేడ్ యొక్క మనస్తత్వంగా కనబడేటట్లు చిత్రిస్తారు. అతని వ్యక్తిగత లోపాలను గోరంతలు కొండంతలుగా చూపెడతారు. అవన్నీ అతని అవకాశవాదంయొక్క ప్రత్యక్ష రూపాలని చెప్పి, ఆ కామ్రేడ్ని గురించి యితరులలో చాల చెడుఅభిప్రాయం కలుగజేస్తారు. ఆ కామ్రేడ్లో పూర్తిగా అవకాశవాదం మూర్తీభవించినట్లూ, దాన్ని తొలగించాలంటే అతనిమీద పోరాటం జరపవలసిన అవసరం ఉన్నట్లూ

అప్పుడు "చచ్చిన పాముమీద నలుగురూ

ట్టవచ్చు." కొంతమందిలో ప్రతీకారవాంఛ

వారు యీ కామ్రేడ్ యొక్క లోపా

టిని సిద్ధాంతలోపాల స్థాయికి

కథలుకూడా అల్లుతారు.

లను, తాము విన్న వదం

వారతనిమీద యింకా కఠినమైన దెబ్బలు కొడతారు. ఒకవేళ అతడు తన అభిప్రాయాలపై పార్టీ కమిటీకి అప్పీలు చేసుకుంటానంటే, అందుకు అంగీకరించరు; తన పొరబాట్లను తమ సమక్షంలో అంగీకరించితీరాలని పట్టుపడతారు. ఒకవేళ అతడు తన పొరబాట్లన్నిటినీ అంగీకరిస్తే, సిద్ధాంతానికి సంబంధించిన అసలు సమస్య పరిష్కరింపబడిందో, పరిష్కరింపబడలేదో పట్టించుకోరు. ఈ విధానంవల్ల జరుగుతూన్నది ఏమంటే, కొందరు కామ్రేడ్స్ యీ ఆంతరంగిక పోరాటాల్లో తాము నిజంగా చేసిన పొరబాట్లకంటె ఎక్కువ పొరబాట్లు చేసినట్లు చెప్పుకుంటారు. తమపై తగిలే దెబ్బలనుంచి రక్షించుకోడానికి తమపైనున్న ఆరోపణ లన్నిటినీ అంగీకరించడమే మంచిదనుకుంటారు. అలా వారు తప్పులన్నీ ఒప్పుకున్న...
ఇంకా వారికి తెలియదు. దీన్నిబట్టి ...
విషయమేమిటో ఇలాంటి పోరాటపద్ధ...
కావలసిన కమ్యూనిస్టు శిక్షణ...

నాలుగు : పార్టీలో అ...
పార్టీ బయట అనుసరించ...

వలసిన పద్ధతులు, పరాయి వర్గాలమీద అవలంబించవలసిన పద్ధతులు అవలంబిస్తున్నారు. నిఘాపెట్టడం, అరెస్టుచేయడం, విచారణ జరపడం, జైళ్లో నిర్బంధించడం మొదలైన ప్రభుత్వ చర్యలకుకూడా పూనుకొంటున్నారు. ఉదాహరణకు, కొంతమంది కామ్రేడ్స్ దేశద్రోహుల్ని తరిమివేసే విషయంలో కొన్ని "అతివాద" పొరబాట్లు చేయడానికి ప్రధానకారణం పార్టీలో అనుసరించవలసిన పోరాటపద్ధతు లెలావుండాలో, పార్టీ బయట అనుసరించవలసినపద్ధతు లెలాఉండాలో వ్యత్యాసాన్ని చూడకపోవడం; పార్టీలో జరపవలసిన సిద్ధాంత పోరాటాన్ని దేశద్రోహులపై జరపవలసిన పోరాటంతో కలగాపులగం చేయడం; తరచు పార్టీలో శత్రుగూఢచారులు రహస్యంగా ప్రవేశిస్తారు. వారికి వ్యతిరేకంగా పోరాటం జరిపేటప్పుడు యథార్థ ఘటనలమీద ఆధారపడాలి; అందరియెదుట వారిని బహిర్గతమొనర్చి, పార్టీనుంచి బయటికి తరమాలి. ఇలాంటి పోరాటానికీ, పొరబాట్లుచేసిన పార్టీ సభ్యుల్ని సరిదిద్దేటందుకు జరపవలసిన పోరాటానికీ చాలాభేధంవుంది. ఈ రెండింటికీ మధ్య మనం స్పష్టమైన వ్యత్యాసాన్ని చూడాలి. పార్టీలో జరపవలసిన పోరాటానికీ, పార్టీ బయట జరపవలసిన పోరాటానికీ చాల దగ్గర సంబంధంవున్నమాట నిజమే; కాని ఆపోరాటాల్లో అవలబించవలసిన పద్ధతులు మాత్రం వేర్వేరుగా ఉండాలి.

కొంతమంది కామ్రేడ్స్ (వీరిని కామ్రేడ్స్ అని పిలవడం తప్పు) పార్టీలో ఆంతరంగిక పోరాటం జరపడానికీ, పార్టీని బెదిరించి లొంగదీసుకోవడాని కీ బాహాటంగా బయటఉన్న

శక్తుల్ని ఉపయోగించుకొంటారు. ఉదాహరణకు వారు సాధించిన కొన్ని పాక్షికవిజయాలమీద, సైనిక దళాలమీద, తుపాకులమీద, ప్రజల్లో వారికిగల పలుకుబడిమీద, ఐక్య సంఘటనలో పనిచేసే కొందరితో వారికిగల సంబంధాలమీద, ఆధారపడి, పార్టీకి వ్యతిరేకంగాను, పై కమిటీలకు వ్యతిరేకంగాను పోరాటం సాగిస్తారు. పై కమిటీలు, తమకోర్కెలను, అభిప్రాయాలను అంగీకరించేటట్లు నిర్బాధ పద్ధాలు లవలంబిస్తారు. పార్టీయెడల వారు స్వాతంత్ర ధోరణి అవలంబిస్తారు; పార్టీమీద సంపూర్ణస్వాతంత్ర్యం ప్రకటించుకుంటారు. లేదా, పై కమిటీలతోగాని, కొంతమంది కామ్రేడ్స్‌తోగాని పోరాటం సాగించడానికి వారు బయటి పత్రికలను, సమావేశాలను సాధనాలుగా ఉపయోగించుకుంటారు; పెట్టుబడిదారుల, శత్రువుల పత్రికలను సహితం ఉపయోగించుకోడానికి వారు వెనుదీయరు. ఇది చాల ప్రమాదకరమైన తప్పు అని వేరే చెప్పనవసరంలేదు. పార్టీ పలుకుబడిని ఉపయోగించుగొని ప్రజల్ని లొంగదీసుకోవడం, వారిని అణచడం, వారిమీద పెత్తనం చెలాయించడం ఎంతప్రమాదకరమైన తప్పో, యిదికూడా అంత ప్రమాదకరమైన తప్పే. వీరు పార్టీమీద పార్టీవ్యతిరేక దృక్పథ నుంచి పోరాటం జరుపుతారు. అందువల్ల వీరు పేరుకు పార్టీ సభ్యులే అయినప్పటికీ, పార్టీ దృక్పథాన్ని పూర్తిగా విడిచిపెట్టారని, శత్రువులుగా తయారయారని చెప్పవలసి వస్తుంది.

ఐదు: మన పార్టీలో అనేక సమస్యలు పార్టీ సమావేశాలద్వారా పరిష్కరింపబడుతున్నాయి. ఇది మంచిదే. కాని అనేక యూనిట్లు అంతకుముందు ఎట్టి సన్నాహాలు చేయ

కుండా, పరిశోధనలు జరపకుండా, సమస్యను పరిశీలించకుండా సమావేశాలు జరుపుతాయి. అందువల్ల తరచు యీ సమావేశాల్లో అనేక భిన్నాభిప్రాయాలు, తగాదాలు బయలుదేరుతాయి. ఇంచుమించు అన్ని సమావేశాల్లోను అంత్యాభిప్రాయాలు నాయకుల అభిప్రాయాలమీద ఆధారపడిఉంటాయి గనుకను, ఈ అంత్యాభిప్రాయాలు నిర్ణయాలతో సమానం గనుకను వాటిలో లోపాలు చాలా ఉంటాయి. కొన్ని సమావేశాల్లో యూనిట్ సెక్రటరీగాని, బాధ్యతగల ఒక కామ్రేడ్ గాని తన అభిప్రాయ మేమిటో చెప్పేవరకూ వివాదాస్పదమైన సమస్యపై సమావేశం నిర్ణయంచేయకుండా ఆపియుంచడం నేనెరుగుదును. ఆ బాధ్యతగల కామ్రేడ్‌కి ఒక స్పష్టమైన అభిప్రాయం లేదు. కాని అది వెంటనే పరిష్కరించవలసిన సమస్యగనుక అప్పటికప్పుడు తనఅభిప్రాయం చెప్పవలసిన పరిస్థితి ఏర్పడింది; లేకపోతే అతడు బాధ్యతగల కామ్రేడ్ గా పరిగణింపబడడు. ఆ బాధ్యతగల కామ్రేడ్ వెంటనే ఏదో ఒక నిర్ణయానికి వచ్చి తీరాలి గనుక, అతడు పెద్ద యిరకాటంలో పడ్డాడు. తొందరగా తన అంత్యాభిప్రాయం తెలియజేశాడు. అంత్యాభిప్రాయమే నిర్ణయంగా పరిగణింపబడింది. దాన్ని పురస్కరించుకొని అనేక యితర నిర్ణయాలు చేయబడ్డాయి. అందుచేత సహజంగా అనేక పొరబాట్లు జరిగాయి. కొంత మంది కామ్రేడ్స్ ఒక సమస్యపై తమ అంత్యాభిప్రాయం తెలియజేయలేనప్పుడు ఆ విషయాన్ని యితరులకు చెప్పడానికి కష్టపడరు. ఆ సమస్యను గురించి ఆలోచించడానికి, పరిశోధన జరపడానికి వ్యవధికావాలనిగాని, పై నాయకుల సలహా పొంద

డాని కవకాశమీయాలనిగాని అడగరు. తమ నాయకత్వాన్ని నిలబెట్టుకోడానికి వారు స్పష్టమైన ఒక అభిప్రాయం తమకున్నట్లే నటిస్తారు. చటుక్కున ఒక నిర్ణయానికి వస్తారు. తరచు అది పొరబాటు నిర్ణయంగా పరిణమిస్తుంది. ఇట్టి లోపాలన్నింటినీ మనం సరిదిద్దుకోవాలి.

మన కామ్రేడ్స్ వివిధ సమస్యలను పరిష్కరించేటప్పుడు యీ క్రింది వైఖరి నవలంబించాలి: "ఒక విషయాన్ని గురించి నీకు తెలిస్తే, తెలుసునని చెప్పు; తెలియకపోతే, తెలియదని చెప్పు. అంతేగాని, తెలియని విషయం తెలుసునని చెప్పవద్దు" పార్టీలో బయలుదేరే క్లిష్ట సమస్యలను నిరంకుశంగా పరిష్కరించడం సాధ్యంకాదు. అన్ని సమావేశాలూ కొన్ని నిర్ణయాలకు రావలసిందే. కాని, తొందరగా నిర్ణయాలు తీసుకోవడం సాధ్యంకానప్పుడు, లేదా సమస్యలు యింకా అస్పష్టంగా ఉన్నప్పుడు, వాటిమీద తొందరపడి నిర్ణయాలు తీసుకోకూడదు. తీసుకునే నిర్ణయం సరియైనదనే నమ్మకం ఉన్నప్పుడే తీసుకోవాలి. అలాంటి నమ్మకం లేనప్పుడు దాన్ని గురించి యింకా ఆలోచించడానికి, లేదా పై కమిటీల సలహా తెలుసుకోడానికి వాయిదావేయాలి. అందరికంటె ఎక్కువ బాధ్యతగల కామ్రేడ్ మాత్రమే అంతిమ నిర్ణయం చేయగలడనుకోవడం పొరబాటు. పార్టీ సమావేశంలో సర్వసాధారణంగా రిపోర్టు యిచ్చిన వ్యక్తే చర్చ పూర్తయిన తర్వాత తన అంత్యాభిప్రాయం తెలియజేస్తాడు. కాని ఆ అంత్యాభిప్రాయాన్ని నిర్ణయంగా పరిగణించ నవసరంలేదు. సమావేశంలో చేయబడే నిర్ణయం ఈ కామ్రేడ్ యొక్క అంత్యాభిప్రాయంతో భేదించ

వచ్చు. సోవియట్ పార్టీలో అవలంబింపబడే కార్యవిధానం యిట్టిదే.

పార్టీలో ముక్కుకు సూటిగాను, అతిగాను జరిగే ఆంత రంగిక పోరాటంయొక్క ప్రధాన రూపాలు యివి.

నేను పేర్కొన్న ఉదాహరణలు మరీ చెడ్డ ఉదాహరణలు. అయినా ఇదివరలోనూ, యిప్పుడూ మన ఆంతరంగిక పోరాటమంతా యిలాగే ఉందనుకోవడం పొరబాటు. ఇలాంటి పోరాట పద్ధతులు పార్టీలో అవలంబింపబడ్డాయనేదిమాత్రం వాస్తవం. ఒకదశలో ఇవే ప్రాబల్యం వహించాయి. ఇవే ప్రధానమైన పోరాటరూపాలుగా తయారయాయి.

ఇట్టి పొరబాటు పద్ధతు లవలంబించడంవల్ల పార్టీలో ఎలాంటి ఫలితాలు కలిగాయి?

మొదటి ఫలితం: వీటివల్ల పార్టీలో నిరంకుశత్వం బలిసింది. ఇలాంటి పద్ధతులద్వారా కొంతమంది వ్యక్తిగత నాయకులూ, పై కమిటీలూ పార్టీసభ్యుల్ని అణచడంలో ఎంతవరకు వెళ్ళారంటే, ఆ పార్టీ సభ్యులకు నోరెత్తి మాట్లాడ్డానికిగాని విమర్శించడానికిగాని ధైర్యం లేకుండా పోయింది.

రెండవ ఫలితం: మరోవైపు పార్టీలో ఉదారవాదం, బూటకపు ప్రజాస్వామ్యం పెంపొందడాని కవకాశం కలిగింది. చాలమంది పార్టీసభ్యులు మామూలు సమయాల్లో నోరెత్తి మాట్లాడ్డానికిగాని, విమర్శించడానికిగాని ధైర్యం ఉండదు; పైకి పార్టీలో సామరస్యం, ఐక్యత ఉన్నట్లు కనిపిస్తుంది. కాని, విభేదాలను దాచిపెట్టడం యిక సాధ్యం కానప్పుడు, పరిస్థితి విషమించినప్పుడు, పొరబాట్లు బహిరంగ మొనరింపబడినప్పుడు

వారు అతి తీవ్రమైన విమర్శలలోను, పోరాటంలోను పాల్గొన ప్రారంభిస్తారు. తత్ఫలితంగా పార్టీలో తగాదాలు, చీలికలు, అరాచకం బయల్దేరుతాయి; వాటిని సరిదిద్దడం యించుమించు అసాధ్యమవుతుంది.

మూడవ ఫలితం: పార్టీ జీవితం ప్రజాస్వామ్య కేంద్రీకరణ ఆధారంపై సక్రమంగా పెంపొందడానికి యీ పద్ధతులు అడ్డువచ్చాయి. అందువల్ల పార్టీలో ప్రజాస్వామ్యం ఎగుడు దిగుడుగానో, మరీ ఎక్కువగానో, మరీ తక్కువగానో పెంపొందింది.

నాల్గవ ఫలితం: ఈ పోరాటపద్ధతులు పార్టీసభ్యుల ఉత్సాహాన్ని, చొరవను, స్వయంకృషిని అరికట్టాయి; పార్టీ యెడల, తమపనియెడల ఉండవలసిన బాధ్యత సడలింది; అందువల్ల కొంతమంది కామ్రేడ్స్ ఉత్సాహంతో బాధ్యతలు తీసుకోడానికిగాని, పనిచేయడానికిగాని, స్వయంకృషి చేయడానికిగాని జంకుతున్నారు. వివిధ సమస్యలను గురించి జాగ్రత్తగా ఆలోచించాలనే శ్రద్ధాసక్తులు వారిలో లోపిస్తున్నాయి. తమ కిచ్చిన పనిని ముక్కుకుసూటిగా చేసుకోవడం, యితరుల మాటలను చిలుకల మాదిరిగా వల్లించడం—ఇదీ వారి కార్య విధానం.

ఐదవ ఫలితం: ఈ పోరాట పద్ధతులు పార్టీలో సెక్టేరియన్ ధోరణికీ, ముఠాపోరాటాలకూ ప్రోత్సాహమిచ్చాయి. పార్టీలో విమర్శన అన్నా, పోరాటమన్నా భయపడే తత్వాన్ని ప్రవేశపెట్టాయి. "ఎవరిపని వారు చేసుకోవడం ఉత్తమం"

అనే యథాతథపు మనస్తత్వాన్ని కలిగించాయి. ఇది "ఎంత తక్కువపనిచేస్తే అంత మంచిది" అనే మనస్తత్వం.

ఆరవ ఫలితం : ఈ పోరాట పద్ధతులవల్ల ట్రాట్స్కీవాద గూఢచారులు, విప్లవ ప్రతీఘాతకులు పార్టీని విచ్ఛిన్నం చేయడానికి అవకాశం కలిగింది. పార్టీ నెమరోడానికి వారికి చాలా సాకులు దొరికాయి. ముఖ్యంగా ట్రాట్స్కీవాద గూఢచారులు పార్టీలోని విభేదాలను చక్కగా ఉపయోగించుకుంటారు. పార్టీని విచ్ఛిన్నం చేయడానికి, అంతరంగిక పోరాటాల్లో అసంతృప్తి చెందిన పార్టీసభ్యుల్ని తమవైపు తిప్పుకోడానికి, పార్టీలోని అపసవ్య పోరాటాలను సాధనాలుగా వినియోగించుకొంటారు. విప్లవ ప్రతీఘాతకులు అవకాశవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని ఆధారంగా చేసుకొని పార్టీమీద దుష్ప్రచారం చేస్తారు. పార్టీ బయట ఉండే అభిమానులమీద, పార్టీలోని బలహీనులమీద పలుకుబడి సంపాదించి, పార్టీని ప్రజలనుంచి దూరంచేసే విధాన మవలంబిస్తారు; పార్టీలోని ఐక్యతను విచ్ఛిన్నం చేయజూస్తారు.

పై చెడుఫలితాలు మన పార్టీలో స్పష్టంగా కనపడ్డాయి. వాటిలో కొన్ని యిప్పటికీ అలాగే ఉన్నాయి.

పార్టీయొక్క అంతరంగిక పోరాటంలో యీ విధమైన తప్పుడు పద్ధతు లవలంబించడంవల్ల చాల కాలంవరకు పార్టీలో విపరీత పరిస్థితు లేర్పడ్డాయి. అవి పార్టీకి నష్టం తెచ్చిపెట్టాయి. పై కమిటీలలో వాటిని సరిదిద్దుకున్నప్పటికీ, మొత్తం పార్టీలో అవి ప్రధాన పోరాటరూపాలుగా లేకపోయినప్పటికీ, క్రింది కమిటీలలోను, మధ్య కమిటీలలోను, కొన్ని వ్యక్తిగత

యూనిట్లలోను యీ పోరాటపద్ధతులింకా వివిధ స్థాయిలలో అలాగే ఉన్నాయి. అందువల్ల యీ యూనిట్లలో పార్టీ జీవితం యింకా అసాధారణంగానే ఉంది. కాబట్టి మనం యీ ప్రమాదకరమైన పెడమార్గాన్ని గురించి కామ్రేడ్స్‌ని హెచ్చరించవలసియుంది. దాన్ని మన పార్టీనుంచి పూర్తిగా నిర్మూలించవలసియుంది. మన కామ్రేడ్స్ తిరిగి అలాంటి తప్పులు చేయకుండా చూడవలసియుంది. వారు సక్రమ పద్ధతుల్లో సిద్ధాంతపోరాటం జరిపేట్లు, పార్టీని ముందుకు తీసుకువెళ్ళేట్లు చేయవలసియుంది.

# 3

## పార్టీలో సిద్ధాంత వ్యతిరేక పోరాటాలు

కామ్రేడ్స్!

ఇప్పుడు నేను పార్టీ ఆంతరంగిక పోరాటాల్లో అవలం బింపబడే మరొక పెడమార్గాన్ని గురించి – సిద్ధాంత వ్యతిరేక (అపసవ్య) పోరాటాన్ని గురించి – చర్చించబోతున్నాను. ఇది ముఖ్యంగా చైనా పార్టీలో చాల ప్రమాదకరంగా పరిణ మించింది. విదేశ పార్టీలలో "ఖాతాఖానీ కొట్టే ధోరణి" ఒకటి ఉన్నప్పటికీ, అక్కడి పరిస్థితి చైనా పార్టీలో ఉన్నంత ప్రమాదకరంగా లేదు. అందువల్ల కామ్రేడ్స్ అంతా యీ పోకడను గురించి జాగ్రత్త వహించేట్లు చూడవలసియుంది; దాన్నెదుర్కోడానికి చర్యలు తీసుకోవలసియుంది. లేకపోతే, పార్టీ ఐక్యతకు, కార్యకలాపాలకు ఆటంకం కలుగుతుంది.

పార్టీలో సిద్ధాంత వ్యతిరేక తగాదాలు, సిద్ధాంత వ్యతి రేక పోరాటాలు అంటే ఏమిటి?

ఈ క్రిందివి సిద్ధాంతవ్యతిరేక తగాదాల క్రిందికి వస్తాయని నా అభిప్రాయం. అంటే అవి మన పార్టీయొక్క, శ్రామికవర్గం యొక్క విప్లవ ప్రయోజనాలకు సంబంధించిన మూలసూత్రా లకు వ్యతిరేకం.

ఒకటి: కొంతమంది కామ్రేడ్స్ పార్టీదృక్పథంనుంచిగాక, పార్టీప్రయోజనాల నాధారం చేసుకొనిగాక తమ స్వప్ర యోజనాలనో, ముఠాప్రయోజనాలనో ఆధారం చేసుకొని

అనేక సమస్యలను లేవనెత్తడం, యితర కార్మికులతో పోరాడ్డం సాగిస్తారు. ఆంతరంగిక పోరాటాల విషయంలో ఈ దృక్పథం సరియైనది కాదు. అందుచేత వారవలంబించే విధానాలు, పద్ధతులుకూడా సరియైనవికావు. ఏ పద్ధతులు తమకు, లేదా కొద్ది మంది వ్యక్తులను ఉపయోగపడతాయో, వాటినే వీరలవలం బిస్తారు. తమకుగాని, కొద్దిమంది వ్యక్తులకుగాని లాభదాయకం కాని పద్ధతులను వీరు వ్యతిరేకిస్తారు. అవి పార్టీకిగాని, విప్ల వానికిగాని లాభదాయక మవునో, కాదో వీరు పట్టించుకోరు; లేదా వాటిని అప్రధానమైన విషయాలుగా త్రోసివేస్తారు. కాబట్టి, వీరంగీకరించేవి, వ్యతిరేకించేవి పూర్తిగా సిద్ధాంతానికి వ్యతిరేకం. పార్టీయొక్క, విప్లవంయొక్క సిద్ధాంతానికి యివి పూర్తిగా చుక్కెదురు. మరోవిధంగా చెప్పాలంటే, వీరిసిద్ధాంతం పార్టీసిద్ధాంతంగాని, విప్లవసిద్ధాంతంగాని కాదు; స్వప్రయోజ నాల సిద్ధాంతం. ప్రతివ్యక్తి తన స్వార్థప్రయోజనాలనే ఒక సిద్ధాంతంగా పరిగణిస్తే, వారిసిద్ధాంతిమూ వారి స్వప్రయోజ నాలూ తప్పకుండా యితరుల సిద్ధాంతాలతోను ప్రయోజ నాలతోను ఢీకొంటాయి. అప్పుడు ప్రతివ్యక్తీ యితరవ్యక్తులతో, పోరాడ్డం అనివార్య మవుతుంది.

ఉదాహరణకు, మీలో కొందరు నెకర్ల విషయంలో గాని, గుర్రాలవిషయంలోగాని, ఆహారంవిషయంలోగాని, బట్టల విషయంలోగాని, వైద్య సహాయం విషయంలోగాని, ప్రమో షన్లవిషయంలోగాని ఇతరులతో తగాదాపడి యుంటారు, లేదా పోరాడియుంటారు. ఇలాంటి సమస్యలు వ్యక్తిగత సమస్యల క్రిందికి, సిద్ధాంతేతర సమస్యల క్రిందికి వస్తాయి. కార్మికుల

సాధారణంగా పార్టీ అంతటికీ లాభదాయకమైన విధంగా నౌకర్లను, గుర్రాలను, ఆహారాన్ని, బట్టను, వైద్యసహాయాన్ని ఎలా పంచాలో తెలియజేసే మూలసూత్రాలను పాటించరు. వాటిని పార్టీ, లేదా స్కూలు అంగీకరించి అమలు జరపాలని కోరరు. "నా కెందుకొక నౌకరు నీయకూడదు? ఒక గుర్రాన్ని నా కెందు కీయకూడదు? నా కెందుకు వైద్యసహాయ మీయరు? నన్ను ఉన్నత పదవి కెందుకు ప్రమోట్ చేయరు? చక్కని ఆహారం, బట్ట నా కెందు కీయరు?" మొదలైన ప్రశ్నలే నా రడిగేవి. ప్రతిదీ "నేను", "నన్ను", "నాకు"మీద కేంద్రీకరింపబడుతుంది; "నా"నుంచి ప్రారంభమవుతుంది. ఇలాంటి సమస్యలపైననే పార్టీలో సాధారణంగా తగాదాలు, పోరాటాలు బయలు దేరుతాయి. వీరు వ్యక్తిగతంగా సంతృప్తికరమైన జీవితం గడుపుతూన్నంతకాలం పరిస్థితు లెంత పాడుగాఉన్నా లెక్క చేయరు.

మరొక ఉదాహరణ: కొంతమంది కామ్రేడ్స్ దుబారా ఖర్చులను వ్యతిరేకిస్తారు. కొందరు దీన్ని పార్టీ ప్రయోజనాల దృష్ట్యా, పార్టీ దృక్పథంతో వ్యతిరేకిస్తారు. అందరూ నిరాడంబర జీవితం గడపాలనే సూత్రానికి వ్యతిరేకంగా నడిచేవారి చర్యలను పేర్కొని వాటిని విమర్శిస్తారు. పొదుపుగా వాడు కోవడ మెలాగో తెలియజేస్తూ సూచనలు చేస్తారు. వాటిని అమలు జరపవలసిందని పార్టీని కోరుతారు. ఇది సరియైన పద్ధతి.

కాని మరికొందరు కామ్రేడ్స్ దుబారా ఖర్చులను పార్టీ ప్రయోజనాలదృష్ట్యా, పార్టీ దృక్పథంతో వ్యతిరేకించరు. ఈ క్రిందివిధమైన సమస్యలను వారు లేవనెత్తుతారు: "కొందరు యింతంత డబ్బు ఖర్చుపెట్టారు; మరికొందరు అంతంత మంచిభోజనం తింటున్నారు. అంతంత మంచిబట్టలు ధరిస్తున్నారు ... నేను మాత్రం అలా ఎందుకు తినకూడదు? అలా ఎందుకు బట్ట కట్టకూడదు? అంత డబ్బు ఎందుకు ఖర్చుపెట్టుకోకూడదు? నేను చాలకాలంగా పనిచేయలేదనా? లేక పార్టీకి తగినంత సేవ చేయలేదనా?" ఈ విధంగా వారు దుబారా ఖర్చులను వ్యతిరేకిస్తూ, వాటికి వ్యతిరేకంగా పోరాడుతున్నట్లే కనిపిస్తారు. ఇందుకు కారణం, యితరులవలె తాము దుబారా ఖర్చులు చేయడానికవకాశం లేకపోవడం. ఇదికూడా ఒక విధమైన సిద్ధాంత వ్యతిరేక పోరాటమే.

ఇంకొక ఉదాహరణ: తూర్పు ఆన్హ్వైలో ప్రభుత్వోద్యోగులందరికీ కొద్దిపాటిగా జీతాలుండేవి (జపానుకు వ్యతిరేకంగా యుద్ధంచేసేకాలంలో విముక్తప్రాంతంలోని ప్రభుత్వోద్యోగులకు జీవితావసర వస్తువులుమాత్రమే యిచ్చేవారు. కొద్దిపాటి చిల్లర తప్ప జీతాలిచ్చేవారుకారు). అందుచేత, కొంతమంది కామ్రేడ్స్ జీతాలు లభిస్తాయనే ఉద్దేశంతో తమకు ప్రభుత్వ సంస్థలలో ఉద్యోగాలిమ్మని కోరేవారు. అలా యివ్వకపోతే, ప్రభుత్వోద్యోగులకు జీతాలిచ్చే పద్ధతి మంచిదికాదనే నినాదంక్రింద పోరాటం ప్రారంభించేవారు. అంతేకాదు. ప్రభుత్వోద్యోగుల జీవనాధారానికి సరిపడే ఎలవెన్సు లెలా నిర్ణయించాలి—అనే సమస్యను పరిష్కరించడానికి

వారెట్టి సూచనలూ చేసేవారుకారు; చర్చలు జరిపే వారు కారు. ఇదికూడా ఒక విధమైన సిద్ధాంత వ్యతిరేక పోరాటమే.

రెండు: కొందరు కామ్రేడ్స్ పార్టీ పరిస్థితులను చక్కబెట్టే ఉద్దేశంతో కాకుండా, పాడుచేసే ఉద్దేశంతోనో, లేదా మరొక చెడు ఉద్దేశంతోనో పార్టీలో తగాదాలు లెచ్చగొడతారు. పోరాటాలు సాగిస్తారు. ఉదాహరణకు, కొందరు కామ్రేడ్స్ పేరుకోసమో, పదవులకోసమో, లోపాలను కప్పిపెట్టుకోడానికో వాస్తవ పరిస్థితిని గమనించకుండా యితర కామ్రేడ్స్‌మీద పోరాటం సాగిస్తారు; పార్టీ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తారు.

మూడు: కొందరు కామ్రేడ్స్ సిద్ధాంత ప్రాతిపదికపై సమస్యలను లేవనెత్తరు. పార్టీ ఫలానామార్గాన్ని అంగీకరించడమో, తిరస్కరించడమో చేయాలని చెప్పరు. తమ వ్యక్తిగత భావోద్రేకాలమీదఆధారపడి, అంటే సంతోషవిచారాలమీద ఆధారపడి సమస్యలను లేవనెత్తడం, పోరాటం సాగించడం చేస్తారు. తమలో నిబిడీకృతమైన దురాలోచనలను, కక్షలను వెళ్ళబుచ్చుకోడానికి వారు యితరులమీద చిందులు తొక్కడం, పళ్ళుబిగించడం జేస్తారు. ఇది ఒకవిధమైన సిద్ధాంత వ్యతిరేక పోరాటం. మరికొందరు కామ్రేడ్స్ తగినంత అనుభవంగాని, సిద్ధాంత పరిజ్ఞానంగాని లేకపోవడంవల్ల సిద్ధాంత సమస్యలను ముందుకు తీసుకురాలేకపోతారు; వాటిపై చర్చలు సాగించలేకపోతారు. అందుచేత వారు సిద్ధాంతంతో ఎట్టి సంబంధమూ లేకుండా, పూర్తిగా ఆచరణకు సంబంధించిన సమస్యలపైన, పరస్పర సంబంధంలేని సమస్యలపైన, సగంసగం

సమస్యలపైన ఎడతెగకుండా పోరాడుతారు. ఇది మరొక విధమైన సిద్ధాంత వ్యతిరేక పోరాటం.

ఉదాహరణకు, కొంతమంది కామ్రేడ్స్ కొన్ని పోరాటాల విషయంలోను, కొన్ని చర్యల విషయంలోను, పోరాట రూపాలు, నిర్మాణ పద్ధతుల విషయంలోను వేర్వేరు అభిప్రాయాలను కలిగివుండవచ్చు. వారు ఎత్తుగడలకు సంబంధించిన మూల సూత్రాలను గురించిగాని, వ్యూహరచనను గురించిగాని, జనరల్‌గా కార్యవిధానాన్ని గురించిగాని, పోరాటరూపాన్ని గురించిగాని, నిర్మాణపద్ధతిని గురించిగాని పట్టించుకోకుండా, ఎవరిఅభిప్రాయాలను వారుపట్టుకొని వ్రేళ్లాడుతారు; ఇతరులతో ఎడతెగకుండా చర్చలు జరుపుతారు. వివిధ సమస్యలను అపసవ్యంగా ముందుకు తీసుకొస్తారు; అందుచేత అవి తరచు సరిగ్గా పరిష్కరింపబడడం జరగదు. ఒకవేళ ఏ అభిప్రాయమైనా సరియైనదైతే తరచు దాన్నిగురించి నిరర్థకమైన వాగుడు ప్రారంభమవుతుంది.

నాలుగు: పార్టీలో ఆంతరంగిక పోరాటాలు క్రమబద్ధమైన నిర్మాణ పద్ధతులకు కట్టుబడకుండా, సవ్యంగానో, అపసవ్యంగానో జరుగుతూ ఉంటాయి. ఉదాహరణలు: సిద్ధాంతానికి వ్యతిరేకంగా పార్టీసభ్యుల్ని తమవైపుకు తిప్పుకోవడం; పార్టీసభ్యులమధ్య వైషమ్యాలు, చీలికలు రెచ్చగొట్టడం; ఇతర కామ్రేడ్స్‌కి వ్యతిరేకంగా కుట్రలు చేయటం, వలలు పన్నడం; వారి సమక్షంలో ఒక్క మాటైనా చెప్పకుండా, వెనకనుంచి గుసగుసలాడ్డం; పార్టీమీద బాధ్యతారహితంగా దుష్ప్రచారం చేయడం; చొల్లుకబుర్లు చెప్పడం; నిరాధారమైన

వదంతులు వ్యాపింపజేయడం; అబద్ధాలాడ్డం; ఇతర కామ్రేడ్స్ మీద చాడీలు చెప్పడం – వగైరా.

ఇవన్నీ సిద్ధాంత వ్యతిరేక పోరాటాలు.

కొంతమంది కామ్రేడ్స్ సిద్ధాంత పోరాటాలలో సిద్ధాంత వ్యతిరేక పోరాటానికి సంబంధించిన లక్షణాలను కలగాపులగం జేస్తారు. లేదా పైకి సిద్ధాంత పోరాటాల మాదిరిగా కనబడే సిద్ధాంత వ్యతిరేక పోరాటాలకు దిగుతారు. మరికొందరు ఒక వ్యక్తికీ - మరొక వ్యక్తికీ మధ్య తగాదాలలోనూ, అసాధారణ సంబంధాలలోనూ విపరీతమైన శ్రద్ధ చూపుతారు; కాని ఆ తగాదాలకు మూలకారణమైన అసలు విషయమేమిటో తెలుసుకోరు.

ఇలాంటి సిద్ధాంతవ్యతిరేకపోరాటాలు పార్టీని నాశనం చేస్తాయి.

కామ్రేడ్స్ యిలా ప్రశ్నించవచ్చు: అసలు సిద్ధాంత మంటే ఏమిటి? సిద్ధాంతంతో సంబంధంలేని, పూర్తిగా ఆచర ణకు మాత్రమే సంబంధించిన సమస్య లేవి? ప్రస్తుత పార్టీ విధా నానికి సంబంధించిన సమస్యలంటే ఏమిటి? ఇట్టి సమస్యలపై మన అభిప్రాయాలను వ్యతిరేకించేవారితో ఎందువల్ల రాజీ చేసుకోవాలి? చివరవరకూ వాటినే పట్టుకొని ఎందుకు వేళ్ళాడకూడదు?

కామ్రేడ్స్! ఇవి అందరూ స్పష్టంగా తెలుసుకోవలసిన సంగతులు.

మొదట సిద్ధాంతమంటే ఏమిటో తెలుసుకుందాం. వస్తువుల పరిణామాన్ని నిర్ణయించే సాధారణ నియమాలే

సిద్ధాంతాలు. వేర్వేరు నియమాలు వేర్వేరు వస్తువుల పరిణామాన్ని నిర్ణయిస్తాయి. ఒకేవిధమైన వస్తువులు ఒకేవిధమైన నియమాలచే పరిణతి చెందుతాయి. సిద్ధాంత సమస్యలంటే అర్థం, అన్ని వస్తువుల పరిణామాన్ని నిర్ణయించే సాధారణ నియమాల కనుగుణ్యంగా వివిధ సమస్యలను చూడ్డంలో, పరిశీలించడంలో, అవలంబించే పద్ధతి. ఈ పద్ధతి తప్పయితే, ఆ యా సమస్యలను చూడ్డంలోనూ, వాటిని పరిష్కరించడంలోనూకూడ తప్పకుండా పొరబాట్లు జరుగుతాయి. వివిధసమస్యల పరిణామాన్ని నిర్ణయించే నియమాలను తప్పుగా అర్థంచేసుకుంటే, అప్పుడు ఆ సమస్యలను పరిష్కరించడంలో మన మవలంబించే పద్ధతికూడా తప్పౌతుంది. అందుచేత మనం సిద్ధాంత సమస్యలను చులకనగా చూడకూడదు. సిద్ధాంత విషయాలలో పొరబాట్లు జరిగితే, వేర్వేరు సమస్యలపై వేర్వేరు పొరబాట్లు జరగడమే కాకుండా, ఆచరణకు సంబంధించిన అనేక సమస్యలపై నిరంతరం, ఎడతెగకుండా పొరబాట్లు జరుగుతూవుంటాయి.

ఏ ఇతర సిద్ధాంతంతోనూ సంబంధం లేని, ప్రస్తుత పార్టీ విధానానికిమాత్రమే సంబంధించిన,సమస్యలంటే ఏమిటి? పూర్తిగా ఆచరణకుమాత్రమే సంబంధించిన సమస్యలెట్టివి?

వీటిలో చాల భాగం వ్యక్తిగత సమస్యలు, దైనిక జీవితానికి సంబంధించిన సమస్యలు; నిత్యకార్యకలాపాలకు సంబంధించిన సమస్యలు. ఉదాహరణకు ప్రజల్ని సమీకరించడం, సంఘటిత మొనర్చడం పూర్తిగా సిద్ధాంతానికి సంబంధించిన సమస్య. ఈ కర్తవ్యాన్ని ప్రధానంగా ప్రజా

సంస్థలు నెరవేర్చాలి. సైన్యం కూడా యిందుకు తోడ్పడుతూ, అట్టి కార్యక్రమంలో పాల్గొనాలి. ఇవన్నీ సిద్ధాంతానికి సంబంధించిన సమస్యలు. వీటితో మనమంతా ఏకీభవిస్తాం. అంటే, సిద్ధాంతం విషయంలో మనమెవరం భేదించడం లేదన్నమాట. కాని, మనలో కొంతమంది కామ్రేడ్స్ సైన్యానికనుబంధంగా ఉన్న సివిల్ ట్రాన్సుపోర్ట్ కోర్ నీ, సివిల్ ట్రాన్సుపోర్ట్ శాఖనూ తాత్కాలికంగా రద్దుచేయాలని అభిప్రాయపడుతున్నారు. వాటిలో పనిచేసేవారందరినీ ప్రజాసంస్థలలో పనిచేయడానికి పంపాలంటున్నారు. మరికొందరు సివిల్ ట్రాన్స్‌పోర్ట్ కోర్ ను రద్దుచేయ కూడదంటున్నారు. కొందరు ప్రజాసంస్థలను నాలుగు శాఖలుగా విభజించాలని వాదిస్తున్నారు. మరికొందరు అయిదు శాఖ లుండితీరాలంటున్నారు. ఇవన్నీ కేవలం ఆచరణకు సంబంధించిన సమస్యలు; సిద్ధాంతానికి సంబంధించినవి కావు.

మరొక ఉదాహరణ: ప్రస్తుతం మనం శత్రుశ్రేణుల వెనుక ఉంటూ, చెల్లాచెదురుగా గెరిల్లాపోరాటం జరిపే విధానమవలంబిస్తున్నాం. ఇది మన ప్రతిఘటనోద్యమంలో యుద్ధ వ్యూహానికి సంబంధించిన సాధారణ సూత్రం. ఈ సమస్యపై మనలో భేదాభిప్రాయమేమీ లేకపోతే, వ్యూహానికి సంబంధించిన మూలసూత్రం విషయంలో భేదాభిప్రాయాలు లేవన్నమాట. కాని ఒక దళనాయకుడు కొన్ని అనివార్య పరిస్థితులలో, లేదా కొన్ని అనుకూల పరిస్థితులలో శత్రువును బాహాబాహి యుద్ధంలో ఢీకొంటాడనుకుందాం; విజయమో, పరాజయమో లభించిందనుకుందాం. ఇది కేవలం ఆచరణకు సంబం

ధించిన ఒక ప్రత్యేక సమస్య. దీనికి సిద్ధాంతంతో ఎట్టి సంబంధమూ లేదు. ఇట్టి స్వభావం కలిగిన ఒకటి రెండు పోరాటాలలో ఒకవేళ పొరబాట్లు జరిగినా అవి వ్యక్తిగతమైన పొరబాట్లే. శత్రుశ్రేణుల వెనుక బాహాబాహీ యుద్ధం జరపాలనే అభిప్రాయాన్ని దళనాయకు డొకసిద్ధాంతంగా చేయనంత కాలం యిలాంటి పొరబాట్లు వ్యక్తిగతమైన పొరబాట్లుగానే ఉంటాయి. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో అతడు చాల చక్కగా కూడ పోరాడి యుండవచ్చు. అలాంటి వ్యక్తిగత సమస్యలపై, ఆచరణకు సంబంధించిన సమస్యలపై మన సొంత అభిప్రాయాలను మొండిగా పట్టుకొని వేళ్ళాడకూడదు; ఎడతెగకుండా చర్చలు జరపకూడదు.

ఇంకొక ఉదాహరణ: ఈరోజున మన సైన్యం ఆయుధాల విషయంలో బలహీనంగా ఉండడంవల్ల శత్రువుయొక్క బలహీన స్థావరాలమీద, ప్రధాన నగరాలమీద దాడిచేయడం తప్పు సిద్ధాంతం. ఈ సిద్ధాంతంపై మనలో అభిప్రాయ భేదాలు లేకపోతే, కొన్ని ప్రత్యేకపరిస్థితులలోనో లేదా ప్రత్యేక అవసరమేర్పడ్డంవల్లనో ఒక బలమైన శత్రుస్థావరంమీదగాని, ప్రధాన నగరంమీదగాని దాడిచేసినప్పటికీ అది ఆచరణకు సంబంధించిన సమస్య అవుతుందేగాని, సిద్ధాంత సమస్యగా ముందుకు రాదు.

కాని యిక్కడొక బలమైన శత్రుస్థావరాన్ని, అక్కడొక ప్రధాన నగరాన్ని స్వాధీనం చేసుకున్నాం గనుక, యికనుంచి శత్రుస్థావరాలన్నిటిమీద, ప్రధాన నగరాలన్నిటిమీద దాడి చేయవచ్చునని ఎవరైనావాదిస్తే, అది సిద్ధాంతసమస్యగా

రూపొందుతుంది. అంతర్యుద్ధకాలంలో కొంతమంది కామ్రేడ్స్ పెద్దపెద్ద పట్టణాలపై దాడులు జరపాలని వాదించారు. వాటిని స్వాధీనం చేసుకోడానికి ఎర్రసైన్యాన్ని పంపారు. అప్పుడది సిద్ధాంతానికి సంబంధించిన ప్రాక్టికల్ సమస్య. కారణమేమంటే, ఎర్రసైన్యం పెద్దపెద్ద పట్టణాలను స్వాధీనం చేసుకోవాలనే సిద్ధాంతంమీద ఆధారపడి వారట్టిదాడులు జరిపేవారు. అందుచేత ఇలాంటి సమస్యలమీద మనం వ్యతిరేకులతో రాజీచేసుకోకూడదు. పెద్దపెద్ద పట్టణాలమీద దాడులు జరపాలనే సిద్ధాంతాన్ని మనం వ్యతిరేకించాలి.

తరచు నిర్దిష్టమైన కొన్ని ప్రాక్టికల్ సమస్యలకు అనేక పరిష్కారమార్గాలు ఉంటాయి. ఒకచోటునుంచి మరోచోటికి వెళ్ళడానికి ఆచరణ యోగ్యమైన మార్గాలు చాలా ఉండవచ్చు. వాటివల్ల కొన్ని లాభాలు, కొన్ని నష్టాలు ఆయా పరిస్థితులనుబట్టి ఉంటాయి. కొన్ని మార్గాలు యితర మార్గాలకంటె ఎక్కువ లాభదాయకంగా ఉండవచ్చు; కాని వాటివల్ల ప్రమాదంకూడా ఉండవచ్చు. అందువల్ల మనం సురక్షితంగా గమ్యస్థానాన్ని చేసుకోనేటందుకు ఇంకొక మార్గం చేబట్టాలి.

ఆచరణకు సంబంధించిన యిలాంటి సమస్యలమీద భేదాభిప్రాయాలేర్పడినప్పుడు ఇతరులతో రాజీ చేసుకోడానికి, వ్యతిరేకుల అభిప్రాయాన్ని స్వీకరించడానికి ప్రయత్నించాలి. "సౌమ్యంగా రాజీకి రావాలి." అప్పుడు అన్ని సమస్యలనూ సక్రమంగా పరిష్కరించుకోవచ్చు; శీఘ్రకాలంతో ఏకాభిప్రాయానికి రావచ్చు. అంతేగాని ఎల్లప్పుడూ మన అభిప్రాయాలనే పట్టుకొని వేళ్ళాడకూడదు; ఇతరులు తమ

అభిప్రాయాలను వదులుకోవాలని పట్టుపట్టకూడదు; మన అభిప్రాయాల ప్రకారమే అన్ని సమస్యలనూ పరిష్కరించ పూనుకోకూడదు. అలా చేస్తే, ప్రతిసమస్య చాల ఆలస్యంగా పరిష్కరించబడుతుంది; పనికి ఆటంకాలు కలుగుతాయి. తగాదాలు తీవ్రరూపం ధరిస్తాయి. వాగుడుధోరణి పార్టీలో బలపడుతుంది. పార్టీ సభ్యులమధ్య ఐక్యత చెడుతుంది. కనుకనే పూర్తిగా ఆచరణకు సంబంధించిన సమస్యలపై మనతో భేదించే పార్టీ సభ్యులతో రాజీచేసుకోడానికి సర్వవిధాలా ప్రయత్నించాలి.

ప్రస్తుత పార్టీ విధానానికి సంబంధించిన సమస్యలంటే ఏమిటో, పూర్తిగా ఆచరణకు సంబంధించిన సమస్యలంటే ఏమిటో ఇప్పుడు మనం సులభంగా తెలుసుకోవచ్చు. పోరాటం యొక్క గమ్యస్థానంతోగాని, పోరాట పద్ధతితోగాని, వ్యూహం-ఎత్తుగడలతోగాని వాటి కెట్టిసంబంధమూ ఉండదు. మన జనరల్ దృక్పథంతోనూ, ప్రత్యేక సమస్యలపై మనకు గల దృక్పథంతోనూ కూడ వాటికి సంబంధం ఉండదు. పై ఉదాహరణలన్నీ యీ తరగతికి చెందిన సమస్యలే.

కాబట్టి మనం వివిధ సమస్యలను పరిష్కరించడంలో అనుసరించవలసిన మూలసూత్రం ఏమంటే, మన పరిష్కార మార్గం పార్టీయొక్క, శ్రామికవర్గంయొక్క పోరాటానికి తోడ్పడుతుందా, లేక హానికలుగజేస్తుందా అనేది. అన్ని విషయాలూ ఈ మూలసూత్రానికి లోబడి ఉండాలి. దీనికి విరుద్ధమైన దృక్పథాలను, అభిప్రాయాలను, చర్యలను వ్యతిరేకించాలి. ఈ మూలసూత్రాలలో కొన్ని పెద్దవి, కొన్ని

చిన్నవీ ఉండవచ్చు. అలాంటప్పుడు పెద్ద వస్తువులో ఒక భాగమైన చిన్న వస్తువు పెద్దవస్తువుకు లోబడి ఉండాలి. తక్షణ ప్రయోజనాలు దీర్ఘకాల ప్రయోజనాలకు, చిన్న సూత్రాలు పెద్దసూత్రాలకు లోబడిఉండాలి. సిద్ధాంత సమస్యలపై రాజీ చేసుకోకూడదు. ఏకాభిప్రాయానికి రావాలంటే, సమగ్రంగా చర్చించాలి. అయితే, సిద్ధాంతంతో సంబంధంలేని సమస్యలపై మాత్రం పట్టుదలతో పోరాడకుండా, రాజీ చేసుకోవాలి; మరీ తీవ్రంగా వాటిని చర్చించకూడదు. లేకపోతే, పని కుంటువడుతుంది; ఐక్యత చెడుతుంది.

ఒక కామ్రేడ్, ఆంతరంగిక పోరాటంలో తన రాజకీయ దృక్పథం "సరియైనది"గా ఉన్నంతకాలం తాను నిర్మాణానికి సంబంధించిన పొరబాట్లు చేసినప్పటికీ ఫరవాలేదని వాదిస్తూంటే నేను విన్నాను. అంటే అతని అభిప్రాయం ప్రకారం, పార్టీయొక్క ఆంతరంగిక పోరాటంలో ఒక వ్యక్తి ఆర్గనైజేషనల్ డిసిప్లిన్‌కి విరుద్ధంగా తన వ్యతిరేకులమీద అనేక పద్ధతులతో పోరాటం సాగించవచ్చునన్నమాట. ఇది చాల తప్పుదృక్పథం. కారణమేమంటే, సరియైన రాజకీయ విధానం, సరియైన ఆర్గనైజేషనల్ పంథా ఒకదానికొకటి వ్యతిరేకమని ఆ కామ్రేడ్ భావిస్తున్నాడు. పార్టీ డిసిప్లిన్‌నీ, నిర్మాణాన్నీ విచ్ఛిన్నం చేయడమంటే సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఘోరమైన తప్పిదం చేయడమన్నమాట. నేటి పరిస్థితులలో యిది మరీ ప్రమాదకరమైన తప్పిదం; పార్టీ ఐక్యతను విచ్ఛిన్నం చేయడమంటే అర్థం శత్రువుకు సహాయంచేసి పెట్టడమన్నమాట. పార్టీయొక్క, శ్రామికవర్గంయొక్క ప్రయోజనాలకు పెద్దనష్టం కలిగించడ

మన్న మాట; సిద్ధాంతరీత్యా జరిగే తప్పిదాలన్నిటికంటె ఘోర మైన తప్పిదం యిదే.

మన కామ్రేడ్స్ వివిధ సిద్ధాంత సమస్యలను పరిశీలించే టప్పుడు ఆయా పరిస్థితులలో ఏది పార్టీ ప్రయోజనాల కెక్కువ లాభదాయకమో ఏది తక్కువ లాభదాయకమో పోల్చి చూడ్డానికి సర్వవిధాలా ప్రయత్నించాలి. చిన్న సిద్ధాంతాలు పెద్దసిద్ధాంతాలకు లోబడాలనే సూత్రాన్నిబట్టి ఏ సిద్ధాంత సమస్యలపై రాజీ చేసుకోవచ్చునో, వేటిపై చేసుకోకూడదో నిర్ణయించుకోవాలి.

ఒక్కొక్కప్పుడు మనం పార్టీలో ఐక్యతను కాపాడ్డానికి అంతగా యెక్కువ ప్రధానంకాని, లేదా వెన్వెంటనే పరిష్క రించ నవసరంలేని సిద్ధాంత సమస్యలపై వ్యతిరేకులతో తాత్కాలికంగా రాజీ చేసుకోవలసి యుంటుంది. వాటిపై అదేపనిగా చర్చించకూడదు. తక్షణమే పరిష్కరించ వలసిన అతిప్రధానమైన సమస్యలపైననే దృష్టిని కేంద్రీకరించాలి. దీన్ని సిద్ధాంతం విషయంలో రాజీగాగాని, మధ్యేమార్గంగాగాని పరిగణించకూడదు; ఆచరణకు సంబంధించిన సమస్యపై యిది రాజీ. మెజారిటీ సభ్యు లంగీకరిస్తేనే యిట్టి రాజీ సంభవం.

ఇవన్నీ సిద్ధాంత వ్యతిరేక పోరాటానికి సంబంధించిన సమస్యలు.

పార్టీలో యిట్టి సిద్ధాంత వ్యతిరేకపోరాటాలు, 'ముక్కుకు సూటిగానూ – అతిగానూ కొనసాగించే పోరాటాలు ఎక్కణ్ణించి పుడతాయి? వాటికి మూలం ఏమిటి?

ఒకటి: పార్టీలో మొత్తంమీద మన కామ్రేడ్స్ యొక్క సిద్ధాంత స్థాయి చాల తక్కువ; అనేక విషయాల్లో వారికి అనుభవంకూడ స్వల్పంమాత్రమే. చాలకాలంవరకు పార్టీకి నాయకత్వం, కేంద్రం లేనేలేదు. ఇంతవరకు వివిధ ప్రాంతాల్లో కొద్దిమంది నాయకులు, కొద్దిపాటి కేంద్రాలు మాత్రమే ఏర్పడ్డాయి.

రెండు: పార్టీలో పెటీ బూర్జువావర్గానికి చెందినవారు చాలమంది ఉన్నారు; ఈ వర్గంయొక్క ఉద్రేకాలు, ఆవేశాలు, పెటీ బూర్జువా వర్గానికి చెందిన రైతుల్లో ఉండే ప్రతీకార వాంఛలు మన ఆంతరంగిక పోరాటాలపై ఎడతెగకుండా తమ ప్రభావాన్ని కలుగజేస్తూవచ్చాయి.

మూడు: పార్టీలో ప్రజాతంత్ర జీవితం అసాధారణ స్వభావాన్ని కలిగియుంది. కామ్రేడ్స్ వివిధ సమస్యలను అన్యోన్యంగానూ, నిష్పక్షపాతంగానూ చర్చించుకొనే పద్ధతి యింకా అలవడలేదు. వివిధ సమస్యలను మోటుగాను, స్వార్థ దృష్టితోను పరిశీలించే విధానమే ఎక్కువ ప్రబలంగా ఉంది.

నాలుగు: అవకాశవాదులు రహస్యంగా పార్టీలో ప్రవేశించారు; కొంతమంది కామ్రేడ్స్‌లో అవకాశవాద మనస్తత్వం బాగా జీర్ణించింది. వారు అందరికంటె తామే ఎక్కువ "బోల్షివిక్కుల" మనిపించుకోడానికి ఉద్దేశపూర్వకంగా "అతివాద" చర్యలకు పూనుకుంటారు; మితవాదంకంటె "అతివాదం" మంచిదని వారి అభిప్రాయం. లేదా వారు తమ ప్రతిష్ఠను ఎక్కువ చేసుకోడానికి యితరులమీద ఆరోపణలు చేస్తారు.

అయిదు : ట్రాట్స్కీ-ముఠాకు చెందిన ద్రోహులు, విప్లవ ప్రతీఘాతకులు రహస్యంగా పార్టీలో ప్రవేశించి, పార్టీ సభ్యులమధ్య జరిగే ఆంతరంగిక పోరాటాలను అవకాశంగా తీసుకొని, పార్టీని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. తరచు వీరు పార్టీ పతాకం క్రిందనే ఉద్దేశపూర్వకంగా కొంత మంది కామ్రేడ్స్‌మీద పోరాటం సాగిస్తారు. తర్వాత యీ ద్రోహుల్లోనే ఒకడు ఆ కామ్రేడ్స్‌తో సంబంధం పెట్టుకొని, వారి అసంతృప్తిని ఉపయోగించుకుంటాడు. వారిని తన ముఠాలోకి గూఢచారులుగా తీసుకుంటాడు.

ఇవీ, ఆంతరంగిక పోరాటంలో వివిధ పెడమార్గాలకు కారణాలు.

మన పార్టీలో మొదటినుంచీ ఆత్మవిమర్శన, ఆంతరంగిక పోరాటాలు కఠినంగానే ఉంటూవచ్చాయి. ఇది చాల అవసరం, మంచిది కూడా. ఈ ఆంతరంగిక పోరాటాల్లో అనేక సమస్యలు సవ్యంగాను, సక్రమంగాను పరిష్కరింపబడ్డాయి. అందువల్ల పార్టీ అనేక ఆంతరంగిక పోరాటాల్లో బ్రహ్మాండమైన విజయాలను సాధించింది; కొంతవరకు పార్టీ సభ్యుల సిద్ధాంత స్థాయిని కూడ ఎక్కువచేసింది. ఈ ఆత్మవిమర్శనలు, ఆంతరంగిక పోరాటాలే పార్టీని రోజు రోజుకు ముందుకు తీసుకెళ్ళాయి. ఇవి లేనిదే పార్టీ అభివృద్ధి చెందదు. అయినప్పటికీ, మన పార్టీ యొక్క దీర్ఘకాల చారిత్రకాభివృద్ధిలో, పై విధమైన పెడమార్గాలు, పొరబాట్లు ఆంతరంగిక పోరాటాల్లో సంభవించాయని ఒప్పుకుతీరాలి; అనేక సందర్భాలలో యీ ఆంతరంగిక పోరాటం సవ్యంగా జరగలేదని

అంగీకరించాలి. తత్ఫలితంగా మన మనేక కష్టనష్టాలకు గురి అయాం. అందుచేత మనం యిదివరలో చేసిన పొరబాట్లనుంచి పాఠాలు నేర్చుకోవాలి; మన కష్టనష్టాలు వృధాకాలేదని రుజువు చేసుకోవాలి; ఇంతవరకూ జరిగిన ఆంతరంగిక పోరాటాల చారిత్రక గుణపాఠాలను తెలుసుకోవడంద్వారా పార్టీని ముందుకు తీసుకెళ్ళాలి.

ఇప్పుడు, యికముందు మనం అనుసరించవలసిన విధాన మేమంటే, ఆంతరంగిక పోరాటాలలో మనం ఇంకా యెక్కువ విజయాలను సాధించడం; ఇదివరకుకంటె తక్కువ కష్టనష్టాలతో పార్టీని అభివృద్ధిచేయడం, ఆంతరంగిక పోరాటాల చారిత్రక గుణపాఠాలను జాగ్రత్తగా తెలుసుకోవడంద్వారానే మనం యీ కర్తవ్యాన్ని నెరవేర్చడం సాధ్యమవుతుంది. ఇందుకు మనం యింతవరకూ అవలంబిస్తూన్న పెడమార్గాలను, పొరబాట్లను పూర్తిగా సవరించుకోవాలి; పార్టీలో ఆంతరంగిక పోరాటాలను సక్రమంగానూ, సత్ఫలితాలిచ్చే విధంగాను కొనసాగించాలి.

# 4

## పార్టీలో అంతరంగిక పోరాట మెలా సాగించాలి?

కామ్రేడ్స్!

ఇప్పుడు సమస్య చాలస్పష్టంగా ఉంది; పార్టీలో అంతరంగిక పోరాటం సక్రమంగాను, సముచితంగాను జరపడ మెలాగు?

ఈ సమస్యపై సోవియట్ పార్టీ, అనేక యితర దేశాల పార్టీలు చాల అనుభవం సంపాదించాయి. చైనాపార్టీకూడ కొంత అనుభవం సంపాదించింది. లెనిన్, స్టాలిన్‌లు దీన్నిగురించి అనేక ఆదేశాలిచ్చారు. మన సెంట్రల్ కమిటీకూడ చాల ఆదేశాలిచ్చింది. పార్టీ సభ్యులందరూ ఈ అనుభవాలను, ఆదేశాలను ఎంతో జాగ్రత్తగా పరిశీలించవలసి యుంది. పార్టీ నిర్మాణాన్నిగురించి మాట్లాడేటప్పుడు ఈ సమస్య తిరిగి చర్చింపబడుతుంది. ఈ వేళ నేను దీన్నిగురించి మాట్లాడను. చైనా పార్టీ సాగించిన అంతరంగిక పోరాటాన్ని ఆధారంగా చేసుకొని, యీ క్రింది అంశాలనుమాత్రమే పార్టీసభ్యుల దృష్టికి తెస్తాను.

ఒకటి, పార్టీలో అంతరంగిక పోరాటాన్ని ఎంతో జాగ్రత్తగాను, బాధ్యతతోను జరపవలసియుంది; చులకన భావంతో జరపకూడదు. మొట్టమొదట మనం సరియైన పార్టీ దృక్పథాన్ననుసరించాలి. అంటే, పార్టీ ప్రయోజనాలను స్వార్థరహితంగా కాపాడాలనే దృక్పథంతో, ఇదివరకుకంటె బాగా పనిచేయాలనే దృక్పథంతో, కామ్రేడ్స్ తమ

తప్పులను సరిదిద్దుకోవడంలో సహాయపడాలనే దృక్పథంతో, యిదివరకుకంటె వారు సమస్యలను చక్కగా అర్థం చేసుకొనేటట్లు తోడ్పడాలనే దృక్పథంతో మన మీా ఆంతరంగిక పోరాటం జరపాలి. ఒకవైపు స్వయంగా పరిశీలనలు జరపడంద్వారాను, ఆలోచించడంద్వారాను వివిధ ఘటనలను గురించి స్పష్టమైన అభిప్రాయాన్ని మనం కలిగియుండాలి. మరోవైపు క్రమబద్ధంగా, ఒక ప్లాను ప్రకారం, యితరులకు మార్గం చూపే విధంగా ఈ ఆంతరంగిక పోరాటాన్ని నడపాలి.

మనం సరియైన మార్గ మవలంబించడంద్వారానే యితరుల తప్పులను సరిదిద్దగల్గుతామని అందరూ గుర్తించవలసియుంది. మనం సరిగా ప్రవర్తించడంద్వారానే యితరుల ప్రవర్తనను బాగుచేయగల్గుతాం. "ఇతరుల తప్పులు దిద్దడానికి ముందు నీ తప్పులు నువ్వు దిద్దుకో" అనే సామెతను అందరూ జ్ఞాపక ముంచుకోవాలి.

మనం ఇటూ అటూ ఊగిసలాడకుండా ఉంటేనే యితరుల ఊగిసలాటలను సరిదిద్దగల్గుతాం.

మనకు సరియైన సూత్రాలు, సిద్ధాంతాలు ఉంటేనే యితరుల సూత్రాలను, సిద్ధాంతాలను సరిచేయగల్గుతాం.

మన మొక సిద్ధాంత సమస్యపై సరియైన అభిప్రాయాన్ని కలిగియుంటేనే, యితరుల గందరగోళాన్ని సరిచేయగల్గుతాం. వేర్వేరు సమస్యలపై సమగ్రమైన భోగట్టా సంపాదించి, ఆ సమస్యలను క్రమబద్ధంగా పరిశీలిస్తేనే, యితర కామ్రేడ్స్‌కి గాని, పార్టీకిగాని సహాయం చేయగల్గుతాం.

ఏ కామ్రేడ్ అయినా యిలా చేయకపోతే, మొదట తాను సరియైన దృక్పథ మవలంబించకపోతే, సరియైన సిద్ధాంతాలపై ప్రావీణ్యత సంపాదించకపోతే, వాటి కనుగుణ్యంగా బాహ్యాపరిస్థితిని చూడకపోతే, లేదా అతడు వేర్వేరు సమస్యలను క్రమబద్ధంగా పరిశీలించక తనలోపాలను తాను సరిదిద్దుకోకపోతే, వివిధ అంశాలపై అతడు స్పష్టమైన అభిప్రాయాలను కలిగియుండకపోతే, ఆంతరంగిక పోరాటంలో అతడు యితరుల తప్పులను సరిదిద్దలేకపోతాడు. ఈ లోపాలను తొలగించుకోకుండా తలబిరుసుగా ఆంతరంగిక పోరాటాన్ని సాగించినట్లయితే, అతడు ముష్టాతిక వంతులు వక్రమార్గంలో పడతాడు.

కండ్లకు కనబడే వాస్తవ విషయాలు, ఆచరణలో కాచి వడబోసిన అనుభవాలు, నిష్కళంకమైన సత్యం — ఇవి అన్నిటినీ జయిస్తాయి.

మన ఆత్మ విమర్శన, ఆంతరంగిక పోరాటం పార్టీనిర్మాణాన్ని, ఐక్యతను, క్రమశిక్షణను, ప్రతిష్ఠను-బలహీన పరచడాని కుద్దేశింపబడలేదు; పైగా వాటిని బలపరచడం, పార్టీ పనిని యింకా పెంపొందించడం వాటి ఉద్దేశం. అందుచేత, పార్టీలో ఆంతరంగిక పోరాటం దానంతట అది యిష్టం వచ్చినట్లు సాగిపోకుండా చూడాలి; బూటకపు ప్రజాస్వామ్యానికి దారి తీయకుండా చూడాలి. మన పార్టీలో నిరంకుశత్వం, బూటకపు ప్రజాస్వామ్యంకూడా నిషిద్ధాలే. ఇవి రెండూ పార్టీలో బయల్దేరే విపరీత లక్షణాలకు రెండుకొసలు.

అందువల్ల పార్టీ యెడల, విప్లవం యెడల అత్యంత బాధ్యతతో ఈ ఆంతరంగిక పోరాటం కొనసాగించాలి.

రెండు: ఆంతరంగిక పోరాటమంటే ప్రధానంగా పార్టీలో విభిన్న సిద్ధాంతాలమధ్య పోరాటమని, విభిన్న సూత్రాల మధ్య వైరమని కామ్రేడ్స్ అర్థంచేసుకోవాలి. సిద్ధాంతాలకు, మూలసూత్రాలకు సంబంధించి నంతవరకు ఒక దృక్పథానికీ, మరోదృక్పథానికీ మధ్య స్పష్టమైన వ్యత్యాసాన్ని చూడాలి. కాని నిర్మాణానికి, పోరాట పద్ధతికి, విమర్శనా పద్ధతికి సంబంధించినంతవరకు కామ్రేడ్స్ ఎంత తక్కువ వైరభావం ప్రదర్శిస్తే అంతమంచిది; ఇట్టి సమస్యలపై ప్రశాంతంగాను సౌమ్యంగాను ఎదిరించడానికి సర్వవిధాలా ప్రయత్నించాలి; అంతేగాని, నిర్మాణానికి సంబంధించిన చర్యలకూ,నిర్ణయాలకూ దిగకూడదు.

ఆంతరంగిక పోరాటం సాగించడంలో కామ్రేడ్స్ సిద్ధాంత ఐక్యతను సాధించేందుకు కృషిచేయాలి; ఇందుకు నిష్కల్మష మైన వైఖరి నవలంబించాలి; సభ్యుల విధానాన్ని పెంపొందించే ధోరణితో మెలగాలి. గత్యంతరం లేనప్పుడు మాత్రమే కఠినమైన పోరాట పద్ధతులకు, శిక్షణ చర్యలకు పూనుకోవాలి. ఏ పార్టీ సభ్యుడైనా ఎప్పుడూ తప్పులే చేస్తూంటే, ఆయా పార్టీ యూనిట్లు కొన్ని సముచితమైన హద్దులలో నిర్మాణానికి సంబంధించిన నిర్ణయాలు చేయవచ్చు; అట్టి హక్కు వాటి కుంది. కొన్ని పరిస్థితుల్లో శిక్షణ చర్యలు తీసుకోవడంగాని, నిర్మాణానికి సంబంధించిన మార్పులు చేయడంగాని చాల అవసరమవుతుంది. అయితే, అట్టి చర్యలు ఆషామాషీగాను, విచక్షణారహితంగాను తీసుకోకూడదు. కామ్రేడ్స్ మీద పార్టీ యూనిట్లు కఠినమైన శిక్షణచర్య తీసుకోవడంద్వారానే కాదు

పార్టీలో డిసిప్లిన్ పెరిగేది. పార్టీలో డిసిప్లిన్‌గాని, ఐక్యతగాని సభ్యులమీద విధింపబడే శిక్షలపై కాదు ప్రధానంగా ఆధార పడేది (అట్టిస్థితి పార్టీలో ఒక పెద్ద సంక్షోభానికి చిహ్నం); సిద్ధాంత ఐక్యతపైన, పార్టీ సభ్యులలో అధికసంఖ్యాకుల చైతన్యంపైన మాత్రమే అది ప్రధానంగా ఆధారపడుతుంది. సిద్ధాంతాలను గురించీ, మూలసూత్రాలను గురించీ మనలో పూర్తిగా స్పష్టమైన అభిప్రాయా లేర్పడ్డనాడు నిర్మాణానికి సంబంధించిన నిర్ణయాలు తీసుకోవడం అవసరమైతే అది చాల సులభమవుతుంది. అప్పుడు పార్టీ సభ్యుల్ని తొలగించడానికి, లేదా కొందరు యిష్టపూర్వకంగా రాజీనామా పెట్టడానికి ఒక్క నిమిషమైనా పట్టదు.

విభిన్న సిద్ధాంతాల, మూలసూత్రాల విషయంలో కామ్రేడ్స్ ఎంత పట్టుదల ప్రదర్శించినా, ఎంత తీవ్రంగా వ్యతిరేకించినా, ఎంత గట్టిగా వాదించినా, పార్టీ నిర్మాణానికి మాత్రం వారు కట్టుబడి ఉండాలి; మెజారిటీ నిర్ణయాలకు బద్ధులై ఉండాలి; పై కమిటీల ఆదేశాలకు లోబడి ఉండాలి. లేకపోతే పార్టీ ఐక్యతగాని, ఆచరణలో ఐక్యతగాని ఉండదు. సిద్ధాంతాల విషయంలో కామ్రేడ్స్ భేదిస్తూన్నంత మాత్రాన వారు పార్టీ నిర్మాణాన్ని ధిక్కరించకూడదు; మెజారిటీ నిర్ణయాలను, పై కమిటీల ఆదేశాలను ఉల్లంఘించకూడదు; స్వతంత్రగా కార్యాచరణకు దిగకూడదు అలాచేస్తే, పార్టీ యొక్క అత్యంత ప్రధానమైన క్రమశిక్షణను ధిక్కరించడ మవుతుంది.

పార్టీలో సక్రమమైన ఆంతరంగిక పోరాటం జరపాలంటే, యీ క్రింది విధంగా నడవాలి: సిద్ధాంతాల విషయంలోను, మూలసూత్రాల విషయంలోను పోరాడేటప్పుడు అతి కఠినంగా ఉండాలి. నిర్మాణం విషయంలోను, పోరాట పద్ధతుల విషయంలోను పోరాడేటప్పుడు సాధ్యమైనంత తక్కువ కఠినంగా ఉండాలి. చాలమంది కామ్రేడ్స్ పొరబాట్లు చేయడానికి కారణమేమంటే, ఒకవైపు సిద్ధాంతాల, మూలసూత్రాల విషయంలో పోరాటంగాని, స్పష్టమైన వ్యత్యాసంగాని లేక పోవడం; మరోవైపు నిర్మాణం విషయంలోను, పోరాటపద్ధతుల విషయంలోను అతిగా పోరాటం సాగించడం. ఇట్టివారు మొగం కందగడ్డలా తయారయేట్లు వాదించుకొంటారు; ఒకరినొకరు దూషించుకొనేవరకు ఆరోపణలు చేసుకొంటారు; ఒకరినొకరు కలుసుకోకుండా మొగం చాటువేసుకొనే స్థితి కూడా ఏర్పడుతుంది. కాని, విచిత్రమేమంటే, వారిమధ్య సిద్ధాంతాలకు, మూలసూత్రాలకు సంబధించిన విభేదాలేవీ ఉండవు.

మూడు: పార్టీ యూనిట్లమీదగాని, కామ్రేడ్స్‌మీద గాని, వారి పనిమీదగాని చేసే విమర్శనలు సముచితంగాను, క్రమబద్ధంగాను ఉండాలి. బోల్షివిక్ ఆత్మవిమర్శన బోల్షివిక్ కొలబద్ద ప్రకారమే జరగాలి. అతిగా విమర్శించడం, ఇతరుల పొరబాట్లను గోరంతలు కొండంతలు చేయడం, విచక్షణారహితంగా పేర్లుపెట్టడం – ఇవన్నీ తప్పు. ఆంతరంగిక పోరాటం ఎంత కఠినంగా ఉంటే అంత మంచిదనుకోకూడదు; దానికున్నూ డా

కొన్ని హద్దులుండాలి; కొంత ఔచిత్యముండాలి. కాఠిన్యం మరీఎక్కువగాఉన్నా తప్పే; మరీ తక్కువగాఉన్నా తప్పే.

కామ్రేడ్స్ యితరుల తప్పులను చూపెట్టడంలోగాని, వాటిని విమర్శించడంలోగాని అతి ప్రధానమైన అంశాలేవో అవగాహన చేసుకోవాలి; అన్నిటికంటె ముఖ్యమైన సమస్యలపై దృష్టిని కేంద్రీకరించాలి. వివిధ సమస్యలను క్రమబద్ధంగాను, స్పష్టంగాను యితరులకు విశదపరచాలి; అలా చేస్తేనే వాటిని పరిష్కరించడం సాధ్యమవుతుంది. ఇతరుల పొరబాట్లనూ పైకి వాస్తవ విషయాలుగా కనబడేవాటినీ ఏకమొత్తంగా గుచ్చెత్తి బహిరంగ మొనర్చడమే పనిగా పెట్టుకోకూడదు. అలాచేస్తే, ఉద్దేశపూర్వకంగా తప్పులు వెదుకుతూన్నట్లు, నిందిస్తూన్నట్లు, దాడిచేస్తూన్నట్లు ఎదుటివారు భావిస్తారు.

మన మొక కామ్రేడ్ని విమర్శించేటప్పుడు అతని లోపాలను, తప్పులను మాత్రమే చెప్పి ఊరుకోకూడదు; అతడు చేసేవన్నీ తప్పులే అన్నట్లు వ్యవహరించకూడదు; అతడు చేసిన మంచి పనులను, సహాయాన్ని, మంచి అభిప్రాయాలను మెచ్చుకోవాలి. అతని అభిప్రాయంలో ఏ కొద్దిపాటి మంచి ఉన్నా, దాన్ని చెప్పకుండా విడువకూడదు. అలా చేస్తేనే, మనం ఆ కామ్రేడ్ని గురించి సమగ్రమైన అభిప్రాయం, విమర్శన యివ్వగల్గుతాం; అతడు తన తప్పులను దిద్దుకోవడంలో తోడ్పడ్డ వారమవుతాం; అతన్ని ఒప్పించగల్గిన వారమవుతాం.

పార్టీయొక్క ఆంతరంగిక పోరాటంలో మన మనుసరించ వలసిన పద్ధతి యిదీ. సముచితమైన విమర్శన, సముచితమైన దృక్పథం, సముచితమైన విధానం—ఇదీ మన మనుసరించ వలసింది. కాఠిన్యం మరీ ఎక్కువగా ఉండకూడదు; మరీ తక్కువగా ఉండకూడదు.

నాలుగు: పార్టీలోగాని, పార్టీ బయటగాని పోరాట సమావేశాలు జరిపే పద్ధతిని మొత్తంమీద ఆపుచేయాలి. పనిని సమీక్ష చేసేటప్పుడు మాత్రమే వివిధ లోపాలను, పొరబాట్లను పేర్కొనాలి. మొదట మనం "సమస్యను" పరిశీలించాలి; ఆ తర్వాతే "వ్యక్తుల" విషయం తీసుకోవాలి. మొదట జరిగిన విషయాన్ని స్పష్టంచేయాలి; అసలు సమస్య ఏదో చెప్పాలి. తప్పులయొక్క స్వభావాన్ని, వాటివల్ల కలిగే హానిని, వాటికిగల కారణాలను వివరించి, ఆ తర్వాత ఎవరెవరు యీ తప్పులకు బాధ్యులో చెప్పాలి; ఎవరిది ఎక్కువబాధ్యతో, ఎవరిది తక్కువ బాధ్యతో కూడా స్పష్టంచేయాలి.

అంతేగాని, తప్పుల కెవరుబాధ్యులో విచారణ జరపడంతో ప్రారంభించకూడదు. ఒక కామ్రేడ్ ఉద్దేశం లేకుండా పొరబాటుచేసి, ఆ పొరబాటును గుర్తించి సరిదిద్దు కోడానికి ప్రయత్నిస్తూన్నట్లయితే, అతన్ని మనం సంతోషంతో స్వీకరించాలి; అంతేగాని నేరస్థుడని పేర్లుపెట్టకూడదు. పార్టీలో ఆంతరంగిక పోరాటాలు సాగించేటప్పుడు మనకార్యకర్తలమీద, కామ్రేడ్సమీద, యితరులమీద దెబ్బలు తీయడం పాలసీగా పెట్టుకోకూడదు. ఎందుచేతంటే, ఆలాంటి పాలసీ దోపిడీవర్గం

కష్టజీవులపై అములుజరిపే నిరంకుశ విధానంతో సమానం. మన పాలసీ పరస్పర సహాయం, కార్యకర్తలమధ్య సోదరవిమర్శ.

కొందరు కామ్రేడ్స్ చాల తరచుగా పార్టీ నిర్ణయాలను ఉల్లంఘిస్తూ ఉండవచ్చు; క్రమశిక్షణను ధిక్కరిస్తూ ఉండవచ్చు; కమ్యూనిస్టు నీతిసూత్రాలను వ్యతిరేకిస్తూ ఉండవచ్చు. అట్టివారితో సిద్ధాంత సమస్యలపై వాదించడం అసాధ్యమైనప్పుడు, వారిపై ప్రత్యేక సమావేశాలలో విచారణ జరపడం తప్పుకాదు. పైగా అలాంటి విచారణలు అవసరంకూడ. అయితే, అందరికీ యీ సూత్రాన్ని వర్తింపజేయకూడదు.

ఐదు : విమర్శనలకు, లేదా శిక్షలకు గురైన కామ్రేడ్స్ పై కమిటీలకు అప్పీలు చేసుకొనే అవకాశం ఉండాలి. ప్రతి కామ్రేడ్ కి తప్పనిసరిగా అతనికి సంబంధించిన రికార్డులు, తీసుకున్న నిర్ణయాలు అతని సమక్షంలో అందజేయాలి; అతడు దాన్నంగీకరించకపోతే, చర్చించి తర్వాత పై కమిటీకి రిఫర్ చేయవచ్చు. (ఏ కామ్రేడ్ అయినా శిక్షింపబడిన తర్వాత అసంతృప్తి ప్రకటిస్తే, పై కమిటీకి అప్పీలు చేసుకోడానికి అతడు ఇష్టపడకపోయినా, అతన్ని శిక్షించిన పార్టీ యూనిట్ తన పై కమిటీయొక్క అభిప్రాయమేమిటో తెలుసుకోవాలి) పై కమిటీకి అప్పీలు చేసుకొనే హక్కును ఏ పార్టీ యూనిట్ కూడా అపహరించడానికి వీల్లేదు; ప్రతిపార్టీ సభ్యునికి ఈ హక్కు యివ్వాలి. ఇలాంటి అప్పీలును ఏ పార్టీ యూనిట్ కూడా తొక్కిపెట్టడానికి వీల్లేదు.

ఏ పార్టీ సభ్యుడైనా సిద్ధాంతానికిగాని మూల సూత్రాలకుగాని సంబంధించిన సమస్యలపై తన యూనిట్ అభి

ప్రాయంతో నిమిత్తం లేకుండా పై కమిటీకి అప్పీలు చేసుకోవచ్చు; సెంట్రల్ కమిటీకి కూడా అప్పీలు చేసుకోవచ్చు. అయితే, ఆ కామ్రేడ్ ముందు తన యూనిట్ లో సమగ్రంగా తన అభి ప్రాయాన్ని, కారణాలను, విభేదాలను వివరించవలసి యుంటుంది. తన యూనిట్‌లో నోరు మెదపకుండా, పై యూనిట్‌ని మోసం చేయడానికి బాధ్యతారహితంగా మాట్లాడడం మాత్రం కూడదు. ఒకసారి అప్పీలు చేసిన తర్వాత, అంతిమ నిర్ణయం పై కమిటీ చేతుల్లో ఉంటుంది. క్రింది యూనిట్ తీసు కున్న శిక్షణచర్యను పై కమిటీ రద్దు చేయవచ్చు; తగ్గించవచ్చు; లేదా హెచ్చించవచ్చు.

సిద్ధాంతానికి, మూలసూత్రాలకు సంబంధించిన ఒక సమస్యపై సమగ్రమైన చర్చ జరిగిన తర్వాత ఏ పార్టీ యూనిట్ అయినా ఏకాభిప్రాయానికి రాలేకపోతే, మెజారిటీ సభ్యుల అభిప్రాయం ప్రకారం ఆ సమస్య పరిష్కరింపబడాలి. అప్పటికీ మైనారిటీ సభ్యులు మెజారిటీతో భేదిస్తే వారు తమ తమ అభి ప్రాయాలను తాముంచుకోవచ్చు. అయితే నిర్ణయాలకు పూర్తిగా కట్టుబడి ఉండాలి.

కొంతమంది కామ్రేడ్స్, లేదా కొన్ని క్రింది కమిటీలు పార్టీ పనిని పరిశీలించేటందుకొక సమావేశం జరపాలని విజ్ఞప్తి చేస్తే, పై కమిటీ అవకాశమున్నప్పుడు అట్టి సమావేశాన్ని ఏర్పాటు చేయాలి.

ఆరు: పార్టీలో జరగవలసిన పోరాటాలకూ, పార్టీ బయట జరగవలసిన వాటికీ మధ్య ఒక స్పష్టమైన గీతగీయాలి. రెండింటిమధ్య చక్కని సమన్వయంకూడా ఉండాలి. పార్టీ

లోపలి పోరాటం, పార్టీ బయటి పోరాటం ఒకేపద్ధతిలో జరగ కూడదు. పార్టీకి వ్యతిరేకంగా పోరాడ్డానికిగాని, పార్టీని బెదిరించి లొంగదీసుకోడానికిగాని బయటి శక్తుల్నీ, బయటి పరిస్థితుల్నీ సాధనాలుగా ఉపయోగించుకోకూడదు. పార్టీలో దాగివున్న ట్రాట్స్కీ అనుచరులు, విప్లవ ప్రతీఘాతకులు ఈ ఆంతరంగిక పోరాటాలను అవకాశంగా తీసుకొని తమ విచ్ఛిన్న చర్యలను కొనసాగించకుండా చూడ్డానికి పార్టీ సభ్యులంతా అప్రమత్తతతో మెలగాలి. ఆంతరంగిక పోరాటాలు సాగించేటప్పుడు యీ దుష్టశక్తులు తమ్ము సాధనాలుగా ఉపయోగించుకోకుండా జాగ్రత్తపడాలి. పార్టీ శిక్షణను ఖచ్చితంగా పాటించడం ద్వారాను, సరియైనమార్గంలో ఆంతరంగిక పోరాటం సాగించడంద్వారానే యిది సాధ్యమవుతుంది.

పార్టీలోపల దాపరికంలేని పోరాటాలు, సిద్ధాంత పోరాటాలు మాత్రమే జరగాలి. పార్టీ నిబంధనావళినిగాని, పార్టీ డిసిప్లిన్‌నిగాని ఉల్లంఘించే పోరాట పద్ధతు లేవీ పనికిరావు.

ఏడు: పార్టీలో సిద్ధాంత వ్యతిరేక తగాదాలు రాకుండా చూడాలంటే, ఈక్రింది విధంగా మెలగాలి:

1. పార్టీయొక్క అత్యున్నత సంస్థతోగాని, ఒకపార్టీ యూనిట్‌తోగాని ఏకీభవించని పార్టీసభ్యులుతమ తమ అభిప్రాయాలను, లేదా విమర్శనలను ఏయే కమిటీలకు తెలియజేయాలో వాటికే తెలియజేయాలి: అంతేగాని ప్రజల్లో వాటిని గురించి ఆషామాషీగా మాట్లాడకూడదు.

2. ఇతర పార్టీసభ్యులతోగాని, బాధ్యతగల పార్టీసభ్యులతోగాని కొందరు సభ్యులు భేదిస్తే, వారి సమక్షంలోనో

లేదా ఆయా పార్టీ యూనిట్లలోనో విమర్శించాలిగాని అందరి తోనూ ఆ విషయమై ఆషామాషీగా మాట్లాడకూడదు.

3. పార్టీ సభ్యులుగాని, క్రింది కమిటీలుగాని ఒక సమస్యపై పైకమిటీతో ఏకీభవించకపోతే,దాన్ని పైకమిటీదృష్టికి తీసుకురావచ్చు; లేదా దాన్ని గురించి చర్చించేటందుకొక సమావేశం జరపమనవచ్చు. లేదా ఆ సమస్యను అంతకంటె పై కమిటీయొక్క దృష్టికి తేవచ్చు. అంతేగాని యితరులతో దాన్ని గురించి ఆషామాషీగా మాట్లాడకూడదు; తమకంటె క్రింది కమిటీలకు తెలియజేయకూడదు.

4. ఒక పార్టీసభ్యుడు తప్పుచేస్తూన్నట్లుగాని, పార్టీ ప్రయోజనాలకు హాని కలిగేవిధంగా ప్రవర్తిస్తున్నట్లుగాని కొందరు సభ్యులు తెలుసుకుంటే, వారు అట్టిచర్యలను గురించి ఏ పార్టీయూనిట్‌కి తెలియజేయాలో ఆ పార్టీ యూనిట్‌కి తెలియజేయాలి. అంతేగాని దాన్ని కప్పిపుచ్చడానికి, ఒకరి తప్పులనొకరు దాచుకోడానికి, ప్రయత్నించ కూడదు.

5. పార్టీసభ్యులు చిత్తశుద్ధితో పనిచేయడ మలవరచుకోవాలి; మోసాన్ని వ్యతిరేకించాలి; ఉబుసుపోక కబుర్లు చెప్పేవారిని, వదంతులు ప్రచారం చేసేవారిని, బాతాఖానీ కొట్టేవారిని, ఇతరుల రహస్యాలు తెలుసుకొనేవారిని తీవ్రంగా ఖండించాలి. పార్టీసభ్యులు కొన్ని కొన్ని విషయాలపై బాతాఖానీ కొట్టకూడదని నాయకత్వంలోఉన్న కమిటీలు ఎప్పటికప్పుడు ఉత్తరువులు పంపాలి.

6. క్రిందనుంచి పైవరకు నాయకత్వంలోఉన్న కమిటీలు ఉబుసుపోక కబుర్లు చెప్పే కామ్రేడ్‌సనీ, సిద్ధాంత వ్యతిరేక

తగాదాలలో కాలం వెళ్ళబుచ్చేవాళ్ళని ఎప్పటికప్పుడు పిలిపించి, స్వయంగా మాట్లాడి, తప్పులుదిద్ది, మందలించి పంపుతూ ఉండాలి. లేదా యితర విధాలైన శిక్షణచర్యలు తీసుకోవాలి.

7. క్రిందినుంచి పైవరకు పార్టీ కమిటీలు సామాన్య సభ్యుల అభిప్రాయాలను గౌరవిస్తూ ఉండాలి. తరచుగా సమావేశాలు జరిపి, వివిధ సమస్యలను చర్చించడం, వారి పనిని సమీక్షచేయడంచేస్తూ ఉండాలి. తమ అభిప్రాయాలను తెలియజేసే అవకాశం ప్రతి సభ్యునికీ యివ్వాలి.

సిద్ధాంత వ్యతిరేక తగాదాలను జనరల్‌గా నిషేధించాలి. వాటిపై తీర్పులు చెప్పడం అసాధ్యం. ఎందుచేతంటే, అలాంటి తగాదాల్లో తప్పెవరిదో ఎవరూ చెప్పలేరు.

కామ్రేడ్స్ మధ్య వచ్చే సిద్ధాంత వ్యతిరేక తగాదాలను పరిష్కరించ ప్రయత్నించేటప్పుడు మనం ఆ తగాదాతోనే ప్రారంభించకూడదు. ఆ కామ్రేడ్స్ యొక్క పనిని సమీక్ష చేసి, నిర్దిష్టంగాను, సిద్ధాంత దృక్పథంతోను వారి ముందున్న కర్తవ్యాలను గురించి చెప్పాలి; వారు నెరవేర్చవలసిన కార్యక్రమాన్ని గురించి, అనుసరించవలసిన మార్గాన్ని గురించి, ప్లానులను గురించి చెప్పాలి. ఆవిధంగా వారి పనిని సమీక్ష చేసేటప్పుడు, నెరవేర్చవలసిన కర్తవ్యాలను గురించి, మార్గాన్ని గురించి, ప్లానులను గురించి వివరించేటప్పుడు కొందరిలో ఉన్న పొరబాటు అభిప్రాయాలను విమర్శించాలి. అప్పుడు కామ్రేడ్సులో యింకా అలాంటి పొరబాటు అభిప్రాయాలున్నాయా-అని అడగాలి. ఉన్నాయంటే, అది సిద్ధాంతానికి సంబంధించిన తగాదా అన్నమాట. ఈ విధంగా, ఒక సిద్ధాంత వ్యతిరేక

సమస్య సిద్ధాంత సమస్యయొక్క స్థాయికి వస్తుంది. ఒకవేళ సిద్ధాంతం విషయంలో తగాదా లేకపోతే, వారిని పైసమీక్ష ప్రాతిపదికపైన, భావి కర్తవ్యాలపైన, కార్యక్రమంపైన కలిసి పనిచేయమని చెప్పాలి; ఈ కర్తవ్యాలను, కార్యక్రమాన్ని నెరవేర్చడానికి సమిష్టిగా కృషి జరపవలసిందని, సిద్ధాంత వ్యతిరేక తగాదాలను మానుకోవలసిందని హెచ్చరించాలి. సిద్ధాంత వ్యతిరేక తగాదాలను సమీక్షల ద్వారాను, ప్రస్తుత లక్ష్యాలను నిర్వచించడం ద్వారాను, పనిని యింకా ముందుకు తీసుకువెళ్ళడం ద్వారాను మాత్రమే పరిష్కరించాలి. మరోవిధంగా వాటిని పరిష్కరించ లేం.

ఒక సిద్ధాంత వ్యతిరేక తగాదాను పరిష్కరించేటప్పుడు మన మెప్పుడూ తీర్పులు చెప్పడానికి పూనుకోకూడదు. ఎందుచేతనంటే, వాటిమీద తీర్పులు చెప్పడం, పరిష్కరించడం సాధ్యంకానిపని. ఒకవేళ తీర్పు సముచితంగా లేకపోతే, యిరుపక్షాలవారూ అసంతృప్తి చెందుతారు. తగాదా యింకా కొనసాగుతుంది.

ఒక కామ్రేడ్ మరొక కామ్రేడ్‌ని పూర్తిగా నమ్మడం లేదనిగాని, అనుమానిస్తున్నాడనిగాని ఆరోపణలు చేయబడితే అలాంటి విషయాలను సర్వసాధారణంగా చర్చకు తీసుకురాకూడదు. ఎందువల్లనంటే, వాటిపై చర్చ నిరుపయోగమవుతుంది. ప్రతి కామ్రేడ్ తాను చేసేపనిద్వారాను, పోరాటాల ద్వారాను, ఆచరణద్వారాను తన నిజాయితీని రుజువుచేసుకోగలుగుతాడు; తనపట్ల యితర కామ్రేడ్స్‌లో ఉన్న అనుమానాలను తొలగించగలుగుతాడు.

కొంతమంది కామ్రేడ్స్ సిద్ధాంత విషయిక పోరాటాల లోకి సిద్ధాంత వ్యతిరేక సమస్యలను ప్రవేశపెట్టవచ్చు. అప్పుడు మనం సిద్ధాంత సమస్యపైననే దృష్టిని కేంద్రీకరించి చర్చించాలి; అలా చేయకపోతే, సిద్ధాంతసమస్య అప్రధానంగా తయారవుతుంది.

మరికొందరు కామ్రేడ్స్ పైకి సిద్ధాంత విషయిక పోరాటం వలె కనబడేటట్లు సిద్ధాంత వ్యతిరేక పోరాటాన్ని సాగించవచ్చు. అప్పుడు మనం సిద్ధాంతానికి సంబంధించినంతవరకు కొన్ని విషయాల్లో అతని అభిప్రాయం సరియైనదేనని అంగీకరించాలి. ఆ వ్యక్తి ఆ సిద్ధాంతాలను పేర్కొంటూన్నంత మాత్రాన వాటిని కాదనకూడదు. అయితే అతని దృక్పథం, అతని పద్ధతులు తప్పు అని నచ్చజెప్పాలి. ఇలా చేస్తేనే మనం ఒక సిద్ధాంత విషయిక పోరాటాన్ని సిద్ధాంత వ్యతిరేక పోరాటంగా మారకుండా చేయగల్గుతాం.

మొత్తంమీద చెప్పాలంటే, పార్టీలో ఆంతరంగిక పోరాటమంటే అర్థం ప్రధానంగా సిద్ధాంతాల విషయంలోను, మూలసూత్రాల విషయంలోను సాగించే పోరాటం. పార్టీలో సమస్తమూ హేతువాదానికి కట్టుబడి ఉండాలి; అన్ని విషయాలు సమగ్రంగా చర్చింప బడాలి. ప్రతిదానికి ఒక కారణం ఉండాలి. మనం ప్రతి విషయాన్ని కార్య కారణ సంబంధాలతో చర్చించినట్లయితే ఏ పనినైనా సులభంగా చేయవచ్చు.

పార్టీలో మనమందరం హేతువాదానికి కట్టుబడియుండడ మలవరచుకోవాలి. ఏది సరియైన హేతువాదమో తెలుసుకో

డానికి కొలతబద్ద ఏమంటే: పార్టీయొక్క, శ్రామికపోరాటం యొక్క ప్రయోజనాలకు అందరూ లోబడ్డం; తక్షణప్రయోజనాలు దీర్ఘకాల ప్రయోజనాలకు లోబడ్డం. పార్టీయొక్క, శ్రామిక పోరాటంయొక్క ప్రయోజనాలను రక్షించే ప్రతి హేతువాదం, దృక్పథం మంచిది. కొద్దిమంది తాత్కాలిక ప్రయోజనాలు ఎక్కువమంది దీర్ఘకాల ప్రయోజనాలకు, శ్రామిక పోరాటం యొక్క దీర్ఘకాలప్రయోజనాలకు లోబడియుండేటట్లుచేసే హేతువాదం, దృక్పథంకూడా మంచిదే. హేతువాదానికి కట్టుబడని ప్రతీ పోరాటం, హేతువాదరహితమైన ప్రతి పోరాటం, సిద్ధాంత వ్యతిరేక పోరాటమే. ఏది హేతువాదానికి కట్టుబడి ఉండదో, ఏది హేతువాద రహితమో అది తప్పు. అలాంటప్పుడు సరియైన నిర్ణయానికి రావడం కష్టం; అంతిమ పరిష్కారం అసాధ్యం. మనం ఒక సమస్యను హేతువాద దృష్ట్యా చర్చించిన తర్వాత కూడ ఏకాభిప్రాయానికి రాలేకపోతే, అప్పుడు ఎవరు పార్టీ ప్రయోజనాలను, శ్రామిక పోరాటంయొక్క ప్రయోజనాలను ధిక్కరిస్తున్నారో సులభంగా తెలుసుకోవచ్చు. అప్పుడు నిరంతరం తప్పులుచేసేవారిమీద శిక్షణచర్య తీసుకోవడం సులభమవుతుంది. వివాదాస్పదమైన సమస్య అవలీలగా పరిష్కరింపబడుతుంది.

హేతువాద దృష్టితో మనం సమస్యలను పరిశీలించాలంటే, పార్టీలో ప్రజాస్వామ్యం ఉండాలి. ప్రశాంతంగాను, నిష్పక్షపాత బుద్ధితోను పరిశీలనలు జరగాలి. నమ్రతతో పరిశీలనలు జరపడం, కామ్రేడ్సయొక్క సిద్ధాంత స్థాయిని

అభివృద్ధిజేయడం, పరిస్థితిని స్పష్టంగా అర్థం చేసుకోవడం, సమస్యను ఆమూలాగ్రంగా పరిశోధించడం, ప్రశాంతంగా ఆలోచించడం – యివి చాల అవసరం. నిర్లక్ష్యంగాను, స్వాభిమానంతోను, చిలకపలుకులమాదిరిగాను, ఆచరణతో సంబంధం లేకుండాను, సమస్యలను ఆమూలాగ్రంగా పరిశోధించకుండాను, పరిష్కారానికి దిగితే, ఒక్క సమస్యనుకూడా హేతువాద దృష్టితో పరిశీలించలేకపోతాం.

మనం హేతువాదానికి బద్ధులంకాకపోతే, లేదా వివిధ సమస్యలను హేతువాదదృష్టిలో పరిశీలించకపోతే వాటిని పరిష్కరించేందుకు నిరంకుశపద్ధతులు, కుయుక్తులు, పార్టీ యిచ్చిన అధికారం, వంచన మొదలైన పద్ధతులకు దిగవలసి వస్తుంది. అలాంటప్పుడు పార్టీలో ప్రజాస్వామ్యంయొక్క అవసరమే ఉండదు. కారణమేమంటే, అందరంకలసి ఒకపని చేయడానికి వివిధ సమస్యలను హేతువాద దృష్ట్యా చర్చించడం ఆంతరంగిక ప్రజాస్వామ్యంయొక్క లక్షణం.

ఇక్కడ "హేతువాదం" అంటే నా ఉద్దేశ్యం సరుకులేని హేతువాదంకాదు; పైకి వాస్తవంగా కనిపించే హేతువాదంకాదు. ఆచరణలో కఠినపరీక్షలకు నిలబడిన వాస్తవమే, యదార్థవిషయాలే "హేతువాదం". కొంతమంది విద్యాధికులు ఉబుసుపోక అనేక కబుర్లు చెబుతూ వుంటారు. ఎదుటివారిని బోల్తాకొట్టించేటట్లు వాదిస్తారు. వారు వాస్తవవిషయాల మీద ఆధారపడకుండా అంతులేని కబుర్లు చెబుతారు. ప్రపంచంలోని అన్ని విషయాలు తమకు తెలుసునన్నట్లు మాట్లాడుతారు. వారిది వట్టి వాగాడంబరం, పార్టీపదజాల ప్రయోగం.

దానివల్ల ఉపయోగమేమీ ఉండదు; పైగా అది పార్టీకి, విప్లవానికి హానికరం. అందుచేత, మనం హేతువాదానికి బద్ధులమై ఉండడ మెలాగో నేర్చుకొనేటప్పుడు ఈ వాగాడంబరాన్ని, పార్టీపదజాలాన్నీ వ్యతిరేకించవలసి యుంటుంది. వాస్తవ జగత్తులో ఉద్భవించిన, కార్యాచరణకు ఉద్దేశింపబడిన, భౌతిక సంబంధమైన హేతువాదాన్ని మన మవలంబించవలసి యుంటుంది. అంటే "మన సిద్ధాంతాలు భౌతిక పరిస్థితులపై ఆధారపడేవిగా" ఉండాలి.

సర్వం హేతువాదానికి కట్టుబడివుండాలి. అలా కట్టుబడక పోతే పనికిరాదు. అపసవ్యంగా వాదించడంకూడా పనికిరాదు; ఉబుసుపోక కబుర్లుచెప్పడం యింకా హానికరం. ఇదంతా చాల కష్టమైనపనే; అయితే మనం బోల్షివిక్కులంగా తయారుకావ డానికి మార్గమిదొక్కటే.

బోల్షివిక్కులెప్పుడూ హేతువాదానికి బద్ధులైఉంటారు. వాస్తవాన్ని వారు విడనాడరు, హేతువాదమంటే ఏమిటో వారు స్పష్టంగా అర్థంచేసుకొంటారు. దాని కనుగుణ్యంగా యితరులతో మెలగుతారు. అంతేగాని, హేతువాదంతో నిమిత్తంలేని పోరాట నిపుణులుకారు వారు!

కామ్రేడ్స్! పార్టీలో ఆంతరంగిక పోరాటం సాగించ డాని కవలంబించవలసిన కొన్ని పద్ధతులను నేను పేర్కొన్నాను.

మన కామ్రేడ్స్ ఆంతరంగిక పోరాటం సాగించడం లోనూ, పార్టీలో ప్రత్యక్షమయే అనేక పెడమార్గాలను వ్యతిరేకించడం కోసూ, ప్రతిసభ్యుని పార్టీ చైతన్యాన్ని పరీక్షించడం లోనూ, ముఖ్యంగా కార్యకర్తల పార్టీచైతన్యాన్ని పరీక్షించడం

లోనూ యీ పద్ధతు లవలంబించాలని నా అభిప్రాయం. అలా చేస్తే, మనపార్టీ సిద్ధాంత విషయాల్లోను, నిర్మాణంలోను యింకా బాగా బలపడుతుంది. మన లక్ష్యంకూడా యిదే!





## గమనిక

1941 జూలై 2 వ తేదీని లీ-షావ్-చీ సెంట్రల్ చైనా పార్టీ స్కూలులో యిచ్చిన ఉపన్యాసం యిది.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B149 |
| పుస్తకం పేరు | పార్టీ అంతరంగిక పోరాటం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Munisha |
| పేజీలు విడదీసినది | Munisha |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |